గాంధీ సాహిత్యమాల ప్రచురణ-27

# భయ విముక్తి

రచన

జవహర్‌లాల్ నెహ్రూ

సంకలనం :

టి. కె. మహాదేవన్



అనువాదం :

అడపా రామకృష్ణరావు




గాంధీ సాహిత్య ప్రచురణాలయం
1-8-43, చిక్కడపల్లి
హైదరాబాదు-20 (ఆం. ప్ర.)

చేసిన త్యాగసాహసాలు అపూర్వమైనవి. అయితే గాంధీజీ నిర్యాణం తర్వాత జన్మించిన క్రొత్తతరంవారికి మహాత్ముని గురించి, ఆయన భావాలను, ఆచరణను, సందేశాలను గురించీ తెలియజెప్పటానికి పుస్తకాలకన్న సులభతర సాధన మరేదీ ఉండదు. దీనిని మనస్సులో నుంచుకొని మా యీ కృషికి ప్రోత్సాహ మివ్వవలసిందిగా ఆంధ్ర మహాజనులను అర్థిస్తున్నాము.

ఉత్తేజకరమైన నెహ్రూ రచనకు అన్నివిధాలా తగిన తెలుగు అనువాద మిది. ఈ అనువాదాన్ని గురించి ఇక్కడ ప్రస్తావించడం, తినబోయే కూరకు రుచిచెప్పటం కాగలదేమోనని మా సంశయం. అనువాదకులు సుప్రసిద్ధ రచయితలు డాక్టరు అడపా రామకృష్ణరావు గారు సంస్కృతాంధ్రాంగ్లభాషలలో సమానమైన పాండిత్యంతోపాటు పరిణతి పొందిన ఉదాత్తశైలిలో వాడుకభాషను వ్రాస్తారు డాక్టరు గారు. మాకీ అమూల్యావకాశాన్ని కలుగజేసిన డాక్టరు రామకృష్ణ రావుగారికి ప్రత్యేక అభివందనలు.

నెహ్రూ వివిధసందర్భాలలో వెలిబుచ్చిన భావపరంపరను ఒక క్రమంలో కూర్చిన మిత్రులు మహాదేవన్‌గారికీ, ఇంగ్లీషు పుస్తకాన్ని ప్రచురించిన కేంద్ర జాతీయనిధి, భారతీయ విద్యాభవన్‌ల అధిపతులకు, మాకీ ప్రచురణావకాశ మిచ్చినందులకు కృతజ్ఞతావందనాలను సమర్పిస్తున్నాము.

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
(ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారకనిధి)
హైదరాబాదు
16—9—63

ఇట్లు,
కోదాటి నారాయణరావు
సంపాదక సమితి కార్యదర్శి.

# విజ్ఞప్తి

గాంధీ సాహిత్య ప్రచురణాలయం పాఠకలోకానికి సమర్పించే ఇరువయ్యేడవ పుస్తకం ఇది. మహాత్మాగాంధీ వ్యక్తిత్వాన్ని, ఆయన సందేశాలను గురించి చర్చిస్తూ స్నేహులూ వెలిబుచ్చిన భావపరంపరను ఒకచోట కూర్చారు శ్రీ టి. కె. మహాదేవన్. గాంధీ జాతీయ స్మారక నిధీ, భారతీయ విద్యాభవన్ - ఉభయ సంస్థలు సంయుక్తంగా వెలువరించిన ఉత్తమ గ్రంథసంచయంలో ఇది ఒకటి.

దీనిని తెలుగులో ప్రచురించవలెనని, సంకల్పించి చాలాకాలమైంది. కార్యరూపం ధరించగలగటానికి కార్యవిలంబన జరిగినందుకు విచారపడటంలేదు. ఆలస్యంగానైనా సంకల్పం ఫలించినందుకు సంతోషిస్తున్నాము. అవరోధాలు తొలగిపోతున్నవి. పాఠకమహాశయులకు, గాంధీ సాహిత్యాన్ని ఇకముందు త్వరత్వరగానే అందించగలమని విశ్వసిస్తున్నాము.

గాంధీ శతజయంతి (2–10–1969) నాటికి, నూరు పుస్తకాలు ప్రచురించాలని ప్రచురణాలయ సంకల్పం. అందులోను బాలలకు ఉపయోగపడే సాహిత్యమున్నూ, క్రొత్తగా అక్షరాస్యులగు పెద్దలకు ఉపయోగపడగల వాఙ్మయమును ప్రచురించవలెనని సంపాదక సమితి నిశ్చయించింది. గాంధీమహాత్ముని రచనలేగాక ఆయననూ, ఆయన సందేశాలను గురించి ప్రపంచంలోని ప్రసిద్ధ మహాపురుషుల అభిప్రాయాలను గూడా ప్రచురించవలెనని మా అభిలాష. అతివేగంగా పరివర్తన పొందుతున్న ఈ యుగ సమస్యలకు గాంధీమహాత్ముని బోధనలు ఎంతవరకు అన్వయించగలవో నిరూపించే పుస్తకాలను ప్రచురించవలెనని గూడా మా కోరిక.

జాతిపితపట్ల ఆంధ్రజాతికిగల ప్రేమాభిమానాలను ఇక్కడ ఏకరువుపెట్ట పనిలేదు. ఆయన బోధనలను పాటించటంలో ఆంధ్రజాతి

చేసిన త్యాగసాహసాలు అపూర్వమైనవి. అయితే గాంధీజీ నిర్యాణం తర్వాత జన్మించిన క్రొత్తతరంవారికి మహాత్ముని గురించి, ఆయన భావాలను, ఆచరణను, సందేశాలను గురించీ తెలియజెప్పటానికి పుస్తకాలకన్న సులభతర సాధన మరేదీ ఉండదు. దీనిని మనస్సులో నుంచుకొని మా యీ కృషికి ప్రోత్సాహ మివ్వవలసిందిగా ఆంధ్ర మహాజనులను అర్థిస్తున్నాము.

ఉత్తేజకరమైన నెహ్రూ రచనకు అన్నివిధాలా తగిన తెలుగు అనువాద మిది. ఈ అనువాదాన్ని గురించి ఇక్కడ ప్రస్తావించడం, తినబోయే కూరకు రుచిచెప్పటం కాగలదేమోనని మా సంశయం. అనువాదకులు సుప్రసిద్ధ రచయితలు డాక్టరు అడపా రామకృష్ణరావుగారు సంస్కృతాంధ్రాంగ్లభాషలలో సమానమైన పాండిత్యంతోపాటు పరిణతి పొందిన ఉదాత్తశైలిలో వాడుకభాషను వ్రాస్తారు డాక్టరుగారు. మాకీ అమూల్యావకాశాన్ని కలుగజేసిన డాక్టరు రామకృష్ణరావుగారికి ప్రత్యేక అభివందనలు.

నెహ్రూ వివిధసందర్భాలలో వెలిబుచ్చిన భావపరంపరను ఒక క్రమంలో కూర్చిన మిత్రులు మహాదేవన్‌గారికీ, ఇంగ్లీషు పుస్తకాన్ని ప్రచురించిన కేంద్ర జాతీయనిధి, భారతీయ విద్యాభవన్‌ల అధిపతులకు, మాకీ ప్రచురణావకాశ మిచ్చినందులకు కృతజ్ఞతావందనాలను సమర్పిస్తున్నాము.

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
(ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారకనిధి)
హైదరాబాదు
16—9—63

ఇట్లు,
కోదాటి నారాయణరావు
సంపాదక సమితి కార్యదర్శి.

"భారతదేశాన్ని నేను ప్రేమించడానికి, ఈదేశసేవకు నే నుద్యమించడానికి కారణం కేవలమిది సువిశాలమైన భూభాగమనికాదు, దీని గతచరిత్ర మహోజ్జ్వలమైనదనీ కాదు. వర్తమాన భారతదేశంపై నాకు గల విశ్వాసం, ఈ దేశం సత్యానికీ, ఉన్నత లక్ష్యాలకూ నిలయమై నిలచివుంటుందనే నమ్మిక, ఇవే నా దేశభక్తికి కారణాలు.... ఈ ఉత్తమాదర్శాలనే గాంధీజీ మనకు ప్రబోధించాడు."

# త్వరలో వెలువడనున్న పుస్తకాలు - ప్రతివారూ చదివితీరవలసినవి :

1. విద్యార్థులకు
   రచన: మహాత్మా గాంధీ
   అనువాదం: శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరము

2. ఆంధ్రప్రదేశ్ నిర్మాణ కార్యకర్తల మహాసభ ప్రత్యేక సంచిక

3. సత్యాగ్రహము
   రచన: మహాత్మా గాంధీ
   అనువాదం: శ్రీ క్రొవ్విడి లింగరాజు

4. శాంతి సమరములలో అహింసా సిద్ధాంతము
   రచన: మహాత్మా గాంధీ
   అనువాదం: శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడు

5. మహాత్మా గాంధీ స్వీయచరిత్ర
   అనువాదం: శ్రీ తల్లాప్రగడ రామచంద్రరావు.

# 1

గాంధీజీని నేను తొలిసారి 1916 లో చూశాను. అప్పుడే మూడు దశాబ్దాలపైన రెండేళ్లు గడిచాయి.[1] నాటికీ నేటికీ నడుమ ఒక యుగమే గడిచింది. గతించిన ఆ కాలాన్ని స్మరించడం, తోడనే భావవీథిలో ఎన్నో స్మృతులు సంచలించడం సహజం.

ఆ యుగం భారతదేశ చరిత్రలో అతి చిత్రమైనది. ఎన్నో ఔన్నత్య పతనాలతో, జయాపజయాలతో నిండిన ఆ గాథ వీరరస ప్రధానమైన జానపద గేయ కథలను; కాల్పనిక కావ్యాలను స్ఫురింపజేస్తుంది. ఆ యుగంలో మేము జీవించాం గనుకనూ, చరిత్రాత్మకమైన భారతీయ నాటకంలో మేము కూడా పాత్రధారులమై ఏ మాత్రమో పాల్గొన్నాం గనుకనూ, మా క్షుద్రజీవితాలను కూడా వీర రసాత్మక కల్పనా కావ్యకాంతులు స్పృశించాయి.

ఆ యుగంలో ప్రపంచమంతటా ఎన్నో యుద్ధాలూ, మహత్తర పరిణామాలూ, ఉత్తేజకరమైన సంఘటనలూ జరిగాయి. ఐనా అప్పుడు భారతదేశంలో జరిగిన సంఘ

1 ఈ వాక్యం నెహ్రూ 1948 లో వ్రాశారు.

టనలు ప్రత్యేకించి విశిష్టరూపంలో కనిపించడానికి కారణం అవి పూర్తిగా భిన్నస్థాయిలో సంభవించడమే. ఎవరైనా గాంధీజీని గురించి ఎక్కువగా తెలుసుకోకుండానే ఆ యుగ చరిత్ర నవలోకిస్తే, భారతదేశంలో ఈ సంఘటనలన్నీ ఎందుకు, ఏ విధంగా జరిగాయని ఆశ్చర్యపడతారు. దీనిని విశదీకరించడం కష్టం. అప్పటి మా ప్రవర్తనను కేవలం హేతువాదరీత్యా అర్థం చేసుకోవడమూ కష్టమే. ఒక్కొక్కప్పుడు ఒక వ్యక్తిగాని, జాతిగాని ఏదో తీవ్ర భావావేశానికి వశమై ప్రత్యేక మార్గాన కార్యాచరణ కుద్యమించడం జరుగుతుంది. ఆ కార్యాచరణ ప్రశంసనీయమైనది కావచ్చు. తరుచుగా నింద్యమైనదీ కావచ్చు. ఏమైనా ఆ ఆవేశం క్రమంగా చల్లారుతుంది. అప్పుడా వ్యక్తి తిరిగి తన పూర్వస్థితికి చేరుకుంటాడు.

ఆనాడు భారత దేశప్రజలు సమష్టిగా అత్యున్నత స్థాయిలో దీక్షాబద్ధులై కృషిచేయడం ఆశ్చర్యకరమైన విషయం. ఆ కృషి ఆ స్థాయిలోనే అవిచ్ఛిన్నంగా చాలా కాలం కొనసాగడం అంతకంటె ఆశ్చర్యకరమైన విషయం. ఇది అన్నివిధాల ప్రశంసించ దగినది. ఆ యుగాన్ని మలచిన మహనీయుని అద్భుత వ్యక్తిత్వాన్ని గుర్తిస్తేనే తప్ప ఆనాటి భారతీయుల భావావేశాన్ని, దీక్షాతత్పరతను వివరించడానికిగాని, గ్రహించడానికిగాని సాధ్యంకాదు. భారత

దేశ చరిత్రలో ఒక అర్థశతాబ్దంపై ఆ మహోన్నతమూర్తి ఛాయ ప్రసరించింది. ఐతే ఆయన ఔన్నత్యం శారీరక మైనది కాదు. అది మానసికమైన, ఆధ్యాత్మికమైన ఔన్నత్యం.

బాపూజీ మరణానికి మనం శోకిస్తున్నాము. తండ్రిని కోల్పోయిన బిడ్డలవలె వాపోతున్నాము. కాని ఆయన మహనీయ జీవితాన్ని పరిశీలిస్తే, శోకించవలసిన కారణ మేమున్నది? ఆయనవలె తమ జీవిత కాలంలోనే కర్మ సాఫల్యాన్ని పొందగల సుకృతం నిజానికి చాలా కొద్ది మందికే లభిస్తుంది. మన లోపాలను చూసి ఆయన బాధ పడ్డాడు. భారతదేశాన్ని ఇంకా ఉన్నతస్థాయికి చేర్పలేక పోయినందుకు చింతించాడు. ఆయన మహాత్ముడు గనుక ఆ విధంగా చింతించడం సహజమే. ఐనా ఆయన జీవితం విఫలమైన దనడాని కెవరు సాహసించగలరు? ఆయన దేనిని స్పృశించినా, దానికొక విలువ, ప్రయోజనం చేకూ రేవి. ఆయన కృషి ఆయన ఆశించినంత అధిక ఫలితాన్ని ఇవ్వకపోయినా, చాలావరకు ఫలిస్తూనే వుండేది. ఆయన సంకల్పాని కెన్నడూ భంగమంటూ ఉండదనిపించేది. భగవ ద్గీత బోధ ననుసరించి ఆయన ఫలంతో నిమిత్తం లేకుండా నిష్కామకర్మలో నియుక్తుడై ఉండేవాడు. అందుచేతనే ఆయన కృషి విధిగా ఫలించేది.

నిర్విరామ కృషితోనూ, విలక్షణ సాహసకృత్యాల తోనూ నిండిన ఆయన సుదీర్ఘ జీవితంలో ఎక్కడా అపస్వరం వినిపించలేదు. బహుముఖంగా విస్తరించిన కార్యకలాపా లన్నిటినీ ఆయన నేర్పుగా మేళవించ గలిగాడు. ఆయన మాటలూ, చేతలూ, అన్నీ చక్కగా కళాత్మకంగా రూపొందేవి. ఆయన జీవిత విధానం లోకం తీరుకు భిన్నంగావున్నా, అప్రయత్నంగానే అది కళామయమై శోభించింది. ఎందుచేతనంటే ఆయన జీవితమే ఒక కళ. దీనినిబట్టి సత్యాన్నీ, సౌమ్యతనూ సాధించగోరేవారి జీవితమే కళాత్మక మవుతుందని తోచింది.

వయస్సు హెచ్చుతున్నకొద్దీ ఆయన శరీరం కేవలం ఆయన ఆత్మకు వాహికగా మాత్రమే కనిపించేది. అందుచేతనే ఆయనను దర్శించినప్పుడు, ఆయన పలుకు లాలకించినప్పుడు, ఆయన భౌతికరూపం సంగతి మనం మరచిపోయేవారం. ఈ ఆధ్యాత్మిక శక్తి కారణంగానే ఆయన కూర్చున్నచోటే దేవాలయంగా భాసించేది. ఆయన అడుగు మోపిన చోటు పునీతమయ్యేది.

చివరకు ఆయనకు మృతికూడ అసాధారణంగా, కళామయంగా, తటస్థించింది. అన్నివిధాల ఆయన జీవితానికి అది తగిన ముగింపని అనిపించింది. యావజ్జీవితం ఆయన మనకిచ్చిన సందేశాన్ని ఆయన మరణం మరింత

స్పష్టంగా మనకు బోధించింది. శారీరక, మానసికశక్తులన్నీ వశంలో ఉండగానే ఆయన మరణించాడు. పైగా ఆయన అభిమతాని కనుగుణంగా ప్రార్థనకాలంలో ఆయనకు మరణం ప్రాప్తించింది. యావజ్జీవితం ఆయన సామరస్య సాధనకై కృషిచేశాడు. తుదిరోజులలో నిర్విరామంగా ఆ లక్ష్య సిద్ధికే పాటుపడ్డాడు. చివరకు ఆ లక్ష్యానికే ఆహుతి అయ్యాడు. అందరూ అపేక్షించే హఠాన్మరణం ఆయనకు ప్రాప్తించింది. జవసత్త్వాలుడిగి శరీరం శుష్కించడంగాని, దీర్ఘవ్యాధికాని, వృద్ధాప్యంవల్ల జ్ఞాపకశక్తి క్షీణించడం గాని జరుగలేదు. ఐనప్పుడు ఆయనను గురించి మనం శోకించడ మెందుకు ?

అందరినీ సమ్మోహితం చేసే దరహాసంతో, ఆ దరహాసకాంతులు ప్రతిఫలించే నేత్రాలతో, సునాయాసంగా దారిచూపుతూ ముందుకు సాగే నేతగా ఆయన మన స్మృతిపథంలో ఎప్పటికీ నిలిచివుంటాడు. ఆయనను స్మరించినప్పుడు శారీరకంగా కాని, మానసికంగా గాని దౌర్బల్యమేదీ మనకు స్ఫురించదు. శక్తిసామర్థ్యాలు పూర్తిగా వశంలో ఉండగానే ఆయన మరణించాడు. ఆ రూపమే మనతరం ప్రజల స్మృతిపథంలో నిలిచి పోగలదు.

ఆ రూప మెన్నటికీ చెదిరిపోదు. అంతేకాదు, ఆయన అదృశ్యంగా మనలో చేరిపోయి, మన ఊహాలను,

సంకల్పాన్ని తన ఆశయాల కనుకూలంగా మలచుకున్నాడు. గాంధీతరం ఒకనాటికి గడిచి పోతుంది గాని, ఆయన ప్రభావం మాత్రం ముందు తరాలవారి మీదకూడా ప్రసరిస్తూనే వుంటుంది. ఆధ్యాత్మికంగా భారతీయులు క్షీణ దశలో ఉండగా ఆయన వచ్చి మనకు శక్తిని ప్రసాదించాడు. ఆయన మనకు ప్రసాదించిన శక్తి తాత్కాలికమైనదికాదు. ఒకనాటితోనో, ఏటితోనో అంతరించేది కాదు. తరతరాలుగా మనజాతికి సంక్రమిస్తున్న వారసత్వంలో ఆ శక్తి కూడా చేరిపోయింది.

బాపూజీ మన దేశానికీ, ప్రపంచానికీ మహత్తరమైన సేవ చేశాడు. మన క్షుద్రజీవితాలను సైతం ఆయన ఉత్తేజితం చేశాడు. ఆయన స్మృతికి అపచారం జరుగకుండా, మన లక్ష్యాన్ని శక్తివంచన లేకుండా సాధించాలి. పలుమారులు మనం చేసిన వాగ్దానాలను నిలబెట్టుకోవాలి. ఇదే మన ప్రస్తుత కర్తవ్యం.



7

ఆయన బక్కచిక్కిన మనిషి - అయినా, ఉక్కు వంటి గట్టితనం కూడా ఆయనలో కనిపించేది. ఎంతటి తీవ్రమైన భౌతికశక్తు లెదిరించినా, ఆయన పర్వతంవలె నిశ్చలంగా నిలిచేవాడు. కొల్లాయి గుడ్డతో ఆయనవేషం ఎంత నిరాడంబరంగా కనిపించినా, ఇతరులను వినమ్రులను చేసే గాంభీర్యం, రాజఠీవి ఆయనలో ఉండేవి. ఆయన స్వయంగా ఎంతో వినయంగా, వినమ్రంగా వ్యవహరించినా, ఇతరులను శాసించే అధికారం కూడా ఆయనలో ఉండేది. ఈ సంగతి ఆయనకు కూడా తెలుసు. అందుచేతనే అవసర మైనప్పుడు ఆయన ఇతరుల నాజ్ఞాపించి పనిచేయించేవాడు. నిశ్చల గంభీర నేత్రాలతో ఆయన ఎదుటివ్యక్తి ఆంతర్యం గ్రహిస్తున్నట్టు చూసేవాడు. ఆయన సరళ మధురవాణి హృదయ కుహరంలోనికి సూటిగా దూసుకుపోయేది. ఆయన ఒక వ్యక్తితో మాట్లాడినా, వెయ్యి మందితో ప్రసంగించినా, ఆ సమ్మోహశక్తి నిశ్చయంగా అందరినీ వశం చేసుకునేది. ప్రతి వ్యక్తికీ ఆయన మాటలు తనకే ప్రత్యేక సందేశమనే భావన కలిగించేవి. ఈ భావనకు మేధాశక్తితో ప్రమేయంలేదు. హృదయమే ప్రధానం- మనస్సు, తర్కం అప్రధాన మనిపించేవి. గాంధీజీ ఈ

"వశీకరణ విద్య"ను వాగ్ధాటితోగాని, రసవంతమైన సమాసాలతోగాని సాధించలేదు. ఆయన కెన్నడూ వ్యర్థమైన మాటలను ప్రయోగించే అలవాటు లేదు. చెప్పదలచిన సంగతి సూటిగా, సరళమైన భాషలో చెప్పేవాడు. ఐతే ఆయన విశిష్ట వ్యక్తిత్వం, చిత్తశుద్ధి ఎదుటివారిని వశం చేసుకునేవి. ఏదో మహత్తరమైన శక్తి ఆయనలో అణిగివున్న దనిపించేది. దేశంలో ఆయనను గురించి వ్యాపించిన విశ్వాసాలు కూడా కొంతవరకీ వాతావరణాన్ని సృష్టించి వుండవచ్చు. ఆయన మహత్త్వాన్ని గురించిన కథలను ఎన్నడూ వినని మనిషికి ఆయన సాన్నిధ్యంలో ఈ సమ్మోహకశక్తి అనుభూతికి వచ్చేది కాదేమో. ఐతే తనకు ప్రతికూలంగావున్న వ్యక్తులను గాంధీజీ సునాయాసంగా వశం చేసుకోగలిగేవాడు. వారికి ఎదిరించే శక్తి కరిగిపొయ్యేది. ఇది నిజంగా చూడ ముచ్చటగా ఉండేది.

గాంధీజీ ఎంత వినమ్రుడైనా, ఆయనలో సానపెట్టిన వజ్రాల కాఠిన్యం కూడా కనిపించేది. మృదుమధురభాషియైనా ఆయన మాటలలో దృఢనిశ్చయం స్పష్టంగా వినిపించేది. ఆయన కళ్ళు గంభీరంగా, ప్రశాంతంగా కనిపించినా, వాటిలోనే అచంచలదీక్షా, మహోజ్జ్వలశక్తీ ప్రతిఫలించేవి.

ఆయన నిదానంగా, మెల్లిగా మాట్లాడేవాడు. ఐనా ప్రజల కోలాహలంలో కూడా ఆయన కంఠం స్పష్టంగా

వినిపించేది. ఎంతో మృదువుగా మాట్లాడే వాడు. ఐనా ఆ మాటలలోనే ఉక్కువంటి పటుత్వం దాగివుండేది. మర్యాదగా నచ్చజెపుతూ స్నేహార్ద్ర కంఠంతో ఆయన ప్రసంగించినా, ఆ మాటలే రాజ శాసనంవలె భయం కలిగించేవి. ఆయన ప్రయోగించిన ప్రతిపదమూ సార్థకమై, దృఢసంకల్పాన్ని వ్యక్తం చేసేది. శాంతి సఖ్యతలను గురించి ఆయన మాట్లాడేవాడు. ఐనా ఆ మాటలే ఆయన శక్తిని, కార్యాచరణ సంసిద్ధతను, అన్యాయాన్ని ప్రతిఘటించితీరే స్థిరసంకల్పాన్ని స్పష్టంగా వెల్లడించేవి. ఆ కంఠం ఈనాడు మనకు సుపరిచితమే. గడిచిన పధ్నాలుగేళ్ళలో తరచుగా మనం వింటూనే వున్నాం.[2] కాని 1919 ఫిబ్రవరి, మార్చి నెలలలో మాకు ఆ కంఠం కొత్తది. మాటలు మమ్మల్ని సమ్మోహితం చేశాయి. కాని ఏం చెయ్యాలో మాకు వెంటనే అర్థం కాలేదు. అంతవరకు మా రాజకీయాల ధోరణి వేరుగా వుండేది. కోలాహలం ఎక్కువగా వుండేది. దూషణతో నిండిన సుదీర్ఘమైన ఉపన్యాసాలుండేవి. ఎవ్వరూ లెక్కచెయ్యని నిరర్థకమైన తీర్మానాల ప్రతిపాదనతో ఆ ఉపన్యాసాలు ముగిసేవి. కాని గాంధీజీ పద్ధతి అది కాదు. ఆయన రాజకీయ విధానంలో మాటలు కాదు, చేతలు ముఖ్యం.

ఆయన బ్రిటిష్ ప్రభుత్వానికే కాదు, స్వదేశీయులకు, ముఖ్యానుచరులకు సైతం అర్థంకాని చిక్కు సమ

2. 1934 లో నెహ్రూ వ్రాసిన వాక్యం.

స్యగా కనిపించేవాడు ! మరేదేశంలోనైనా ఉంటే ఈనాడు గాంధీజీని విడ్డూరంగా చూసేవారేమో.[3] కాని భారతీయులకు అహింసను గురించి, పాపాన్ని గురించి, మోక్షాన్ని గురించి మాట్లాడే ఆధ్యాత్మిక తత్త్వ బోధకు లంటే ఈనాటికీ గౌరవమే. మన పురాణాలలో మహత్తరమైన త్యాగాల మూలంగానూ, కఠోరమైన తపశ్చర్యలవల్లనూ గొప్పశక్తిని గడించి దేవ, మానవులను శాసించ నేర్చిన మహర్షుల కథలు కోకొల్లలుగా కనిపిస్తాయి. తరుగులేని గాంధీజీ ఆత్మశక్తికి నిదర్శనాలను చూసినప్పుడు నా కాపురాణ గాథలు జ్ఞప్తికి వచ్చేవి. ఆయన అసామాన్య వ్యక్తి. పరిమిత దృష్టికి అందని రహస్యాలేవో ఆయన కళ్ళలో మెదిలేవి.

అనన్య సామాన్యమైన ఆకర్షణతో ఆయన ప్రజలను ఇట్టే వశం చేసుకోవడం ఎంతో మనోరంజకంగా ఉండేది. ఆయన మాటలుకాని, వ్రాతలుకాని ఆయన మహత్త్వపూర్ణ వ్యక్తిత్వాన్ని స్పష్టంగా వెల్లడించవు. భారతదేశానికి ఆయన చేసిన సేవకూడా మహత్తరమైనదే. ఆయన భారతీయులలో ధైర్య శౌర్యాలను, క్రమశిక్షణను, స్థైర్యాన్ని, లక్ష్యసిద్ధికి కావలసిన త్యాగ గరిమను ప్రజ్వలింపజేశాడు. ధైర్యమే శీలానికి మూలమనీ, ధైర్యం లేనిదే నీతి, మతం, ప్రేమ, ఏవీ లేవని ఆయన అన్నాడు. "భయం తొలగనంత వరకు సత్యాన్ని, ప్రేమను అనుసరించడం

3. 1936లో వ్రాసిన వాక్యం.

సాధ్యంకాదు." హింసకు ఆయన పూర్తిగా విముఖుడైనా "హింసకంటె అధైర్యం ఇంకా అసహ్యాకరమైన" దని అన్నాడు. "క్రమశిక్షణ మనిషి చిత్తశుద్ధికి నిదర్శనం. త్యాగం, క్రమశిక్షణ, సంయమం లేనిదే మనిషికి ఆశలేదు. నిష్కృతిలేదు. క్రమశిక్షణ లేనిదే త్యాగంకూడా వ్యర్థమే." ఈ మాటలలో కొత్తదనమేమీలేదు. ఇది తరతరాలుగా నలుగురినోటా నలిగిన ధార్మిక పదజాలమే. కాని గాంధీజీ నోట ఆ మాటలకు నవసత్త్వం చేకూరింది. ఆయన లక్ష్యాన్ని సాధించితీరేవ్యక్తి అని భారతదేశం గుర్తించింది.

క్రమంగా ఆయన భారతదేశానికి ప్రాతినిధ్యం వహిస్తూ, అనేక ఔన్నత్యపతనాలను కళ్ళచూసిన ఈ సనాతన భూమి నైతికశక్తిని లోకానికి చాటాడు. ఆయనయే భారతదేశమనిపించేది. ఆయనకేంజరిగినా అది ఈ దేశానికే జరిగిందనిపించేది. ఆయనను ఎవరైనా అవమానిస్తే, అది కేవలం ఒక వ్యక్తికి అవమానంకాదు. యావద్భారత జాతికే అవమానంగా రూపొందేది. ఆ విధంగా అప్పుడప్పుడు ఆయనను కించపరిచిన విదేశీయ పరిపాలకులు తమ చర్యలవల్ల చివరకు తమ కెంత చేటు మూడుతుందో గ్రహించలేక పోయారు. 1931 డిసెంబర్ నెలలో రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్ ముగిసిన తరువాత గాంధీజీ స్వదేశానికి తిరిగి వస్తున్నప్పుడు రోమన్ కేథలిక్ మతాచార్యుడు పోప్ ఆయనతో మాట్లాడడానికి నిరాకరించాడని

విన్నప్పుడు నాకెంత కష్టమనిపించిందో ఇప్పటికీ నాకు జ్ఞాపకం. పోప్ తిరస్కృతి భారతదేశానికే అవమానంగా నేను భావించాను. మన దేశాన్ని అవమానించాలనే ఉద్దేశం లేకపోవచ్చు కాని, బుద్ధి పూర్వకంగానే పోప్ గాంధీజీతో మాట్లాడడానికి నిరాకరించాడు. తమ సిద్ధులను, మహాత్ములనే తప్ప కేథలిక్ మతం ఇతరులను మహాత్ములుగా గుర్తించదు. అందులోనూ కొందరు ప్రొటస్టెంట్ శాఖీయులు, గాంధీజీని ధార్మికపురుషుడని, నిజమైన క్రైస్తవుడని - అంటే నిజంగా క్రీస్తుబోధలను పాటించే సత్పురుషుడని - పేర్కొన్నారు. అందుచేత కేథలిక్ మతాచార్యునికి గాంధీజీతో ఏ సంబంధమూ లేకుండా ఉండవలసిన అవసరం మరింత కలిగింది.

గాంధీజీతో వ్యక్తిగత పరిచయం లేక, కేవలం ఆయన రచనలనే చదివినవారికి ఆయన ఎప్పుడూ మడీ, మైలా అంటూ, నియమనిష్ఠురమైన, నిరానందమయమైన కఠోరజీవిత విధానాన్ని అవలంబించే మత బోధకుల కోవకు చెందినవాడనే అపోహ కలుగవచ్చు. కాని ఆ రచనలు ఆయన వ్యక్తిత్వాన్ని స్పష్టంగా చూపలేవు. నిజానికి ఆయన రచనలను ఉదాహరించి విమర్శిస్తే, గాంధీజీకి కొంత అన్యాయమే జరుగుతుంది. ఎందుచేతనంటే ఆయన తత్త్వం "నన్ను ముట్టుకోకు నామాలకాకి" అనే కొందరు మతబోధకుల తరగతికి చెందినది కానేకాదు. ఎప్పుడూ కులాసాగా హాస్య

పరిహాసాలతో నవ్వుతూ, నవ్విస్తూ వుండేవా డాయన. పసి పిల్లలలో కనిపించే ఆకర్షణ ఏదో ఆయనలో కూడా ఉండేది. ఆయన ఎక్కడైనా అడుగుపెడితే వెంటనే ఆ వాతావరణం ఆనంద పూరితమయ్యేది.

గాంధీజీ ప్రకృతిసౌందర్యాన్ని చూసి ఆనందించేవాడు. కాని, మనుష్యులు లలిత కళల ద్వారా సృష్టించిన సౌందర్యవిభవాన్ని గుర్తించి హర్షించలేదు. అయినా అప్రయత్నంగానే ఆయన తన జీవితాన్నే ఒక కళగా మార్చుకుని ఆ కళలో సిద్ధి పొందగలిగాడు. ఆయన మాటలూ, చేతలూ అన్నీ రమ్యంగా, రస సంపన్నంగా రూపొందాయి. మధ్య తరగతి ప్రజలలో కనిపించే పామరత్వంగాని, కృత్రిమత్వంగాని ఆయనలో ఏమాత్రం తల యెత్తలేదు. స్వయంగా శాంతిని సాధించి, సమీపించిన వారందరికీ శాంతిని ప్రసాదిస్తూ, దుర్గమమైన జీవిత యాత్రను ఆయన సునాయాసంగా చేయగలిగాడు.

జాతీయోద్యమ కార్యకలాపాలలో కూడా ఆయన ఆధ్యాత్మిక దృష్టికే ప్రాముఖ్య మిచ్చాడు. మతమంటే ఆయన దృష్టిలో కేవలం సనాతనాచారాలూ, సంప్రదాయాలూ కావు. మతం ధర్మబద్ధమైన జీవనవిధానమని ఆయన విశ్వాసం. అందుచేత ఆయన నాయకత్వంలో జాతీయోద్యమం సామాన్య ప్రజానీకానికి సంబంధించినంతవరకు ఒక ధార్మికోద్యమంగా రూపొందింది.

అయితే మనదేశంలో ఈ విధంగా హిందువులలోనూ, ముస్లిములలోనూ రాజకీయవ్యవహారాలలోను మతప్రసక్తి తలయెత్తడం నాకు కొంతవరకు కష్టకారణంగా ఉండేది. బహిరంగసభలలో మౌల్వీలూ, మౌలానాలూ, స్వాములూ చేసిన కొన్ని ప్రసంగాలు చాలా అసంగతమైనవని నేను బాధపడ్డాను. వారికి గతచరిత్రగాని, ఆర్థికశాస్త్రంగాని, సాంఘికశాస్త్రంగాని ఏమాత్రమూ తెలియదని వారి మాటలు నిరూపించాయి. పైగా ప్రతిసమస్యను మతంతో ముడిపెట్టడంవల్ల స్పష్టంగా ఆలోచించడాని కవరోధ మేర్పడింది. గాంధీజీ మాటలుకూడా కొన్ని — రానున్న సుదినాలను మాటిమాటికీ 'రామరాజ్యం' అని వర్ణించడం వంటివి — నాకు నచ్చలేదు. కాని ఆయనను వారించే శక్తి నాకు లేదు. పైగా ఈ మాటలు జన సామాన్యానికి సుపరిచితమైనవీ, సులభంగా అర్థమయ్యేవీ గనుక ఆయన వీటిని ప్రయోగిస్తున్నాడని నాకు నేను నచ్చజెప్పుకున్నాను. ప్రజల హృదయాలను వశం చేసుకోవడంలో ఆయన ప్రజ్ఞ అసమానం.

ఆయనను అర్థం చేసుకోవడం చాలా కష్టం. ఒక్కొక్కప్పుడు ఆధునిక యువజనులకు ఆయన ఏమంటున్నాడో తెలిసేది కాదు. ఐనా ఆయనతో సాన్నిహిత్యం వల్ల ఆయన అసాధారణ వ్యక్తి అనీ, ఉత్తమనాయకుడనీ మేము గ్రహించాం. ఆయనపట్ల మాకు సంపూర్ణ విశ్వాస

మేర్పడింది. అందుచేత తాత్కాలికంగానైనా మేము పూర్తిగా ఆయన ఇచ్ఛకు బద్ధులమై జీవించాం.[4]

మాలో కొందరం రాజకీయరంగంలోనూ, ఇతర రంగాలలోనూ ఎక్కువగా గాంధీజీ ప్రభావానికి లోను కావడంచేత మతవిషయంలోకూడా ఆయన ధోరణిని నిరాకరించలేకపోయాం. సూటిగా ఆయన మాతో మతప్రసక్తి తీసుకువచ్చి మా ఊహాలను మార్చడానికి యత్నిస్తే, మేము లొంగిపోయేవాళ్ళం కాదేమో కాని ఆయన పరోక్షంగానే మాలో ఈ మార్పు తీసుకవచ్చాడు. మత సంబంధమైన కర్మకాండపై నాకెన్నడూ గౌరవంలేదు. పైగా మతం పేర కొందరు మతాచార్యులు అమాయక ప్రజలను మోసగించడం నాకు చాల కష్టమనిపించేది. ఐనా గాంధీజీ మూలాన మతంపట్ల నా వైఖరిలో క్రమంగా కొంత మార్పు వచ్చింది.

ముఖ్యంగా జాతీయోద్యమంలోనూ, సత్యాగ్రహంలోనూ కనిపించిన నైతికశక్తికి నేను హర్షించాను. అహింసా సూత్రానికి నేను పూర్తిగా కట్టుబడలేదు. ఐనా భారతదేశ చరిత్రను, సంప్రదాయాలనుబట్టి చూస్తే అదే సరియైన విధానమేమోనని నాకు తోచింది. రాజకీయ వ్యవహారాలను ఆధ్యాత్మిక తత్త్వంతో పునీతంచెయ్యడం ప్రశంసనీయమైనదని నేను భావించాను. ఉత్తమలక్ష్యాన్ని ఉత్తమ

4 1936 లో వ్రాసిన వాక్యం.

సాధనాలతోనే సాధించాలి. ఇది కేవలం ప్రశంసార్హమైన నైతికసూత్రం మాత్రమే కాదు, - రాజకీయంగా చూసినా, ఇదే యోగ్యమైన విధానమనిపించింది. ఎందుచేతనంటే వక్రమార్గాలద్వారా ఉత్తమలక్ష్యం సిద్ధించకపోవచ్చు. పైగా అందువల్ల కొన్ని కొత్తసమస్యలూ, చిక్కులూ ఏర్పడవచ్చు. పైగా వ్యక్తిగతంగా నైతేనేం సమష్టిగా నైతేనేం కుటిల మార్గాన్ని అనుసరించడం ఆత్మగౌరవానికి భంగకరమని పించింది. అడుసులో కాలుపెడితే అంటుకోకుండా ఉంటుందా? కృంగిపోయి, మోకాళ్ళమీద ప్రాకుతూ వుంటే, వడివడిగా ముందడుగు వేసుకుంటూ నడువగలమా?

గాంధీజీ దృష్టిలో మతం అత్యంత ముఖ్యమైనది. ఆయన విశ్వాసాలు, కార్యకలాపాలు, అన్నీ ఆయన హిందూమతాన్ని అనుసరించి తన జీవన విధానాన్ని మలచుకున్నట్టు స్పష్టంచేస్తాయి. అయినా ఆయన దృష్టిలో మతమంటే తరతరాలుగా వ్యాప్తిలో వున్న సంప్రదాయాలూ, కర్మకాండా, శాస్త్రవచనాలూ కావు. ఆయనకు మతం ముఖ్యంగా నైతికజీవితాన్ని నిర్దేశించే సూత్రం. దీనినే ఆయన సత్యవ్రతమనీ, ప్రేమమార్గమనీ అనేవాడు. ఆయన దృష్టిలో సత్యానికీ, అహింసకూ భేద మేమీ లేదు. ఒకే తత్త్వానికి అవి రెండు రూపాలని ఆయన విశ్వాసం. అందుచేతనే ఆయన వాటిని దాదాపుగా పర్యాయపదాలు గానే ప్రయోగించేవాడు.

హిందూధర్మం ఆంతర్యాన్ని గాంధీజీ చక్కగా గ్రహించాడు. తన దృష్టిలో అనుసరణీయంగా, ఆదర్శ ప్రాయంగా కనిపించని సిద్ధాంతాలను, ఆచారాలను ఆయన నిస్సంకోచంగా నిరాకరించాడు. అవి మూలసూత్రాలు కావని, తరువాతి తరాలవారి కల్పనలూ, చేరికలూ అని ఆయన అభిప్రాయం. "నైతికంగా నేను గ్రహించలేని, సమర్థించలేని ప్రాచీన సంప్రదాయాలకు నేను బానిసను కాలే" నని ఆయన అన్నాడు. అందుచేత నైతికసూత్రాన్నే తనకు ధ్రువతారగా చేసుకుని, ఆయన తన జీవిత విధానాన్ని, కార్యాచరణ ప్రణాళికను తన విశ్వాసాని కనుకూలంగా రూపొందించుకున్నాడు. ఇది సమంజసమా, కాదా అని ఎవరైనా వాదించవచ్చు. ఆయన మాత్రం తనతో సహా అందరినీ ఆ గీటురాయి మీదనే పరీక్షించేవాడు సామాన్య మానవులకీ వైఖరి, రాజకీయంగానూ, ఇతర రంగాలలోనూ ఎన్నో చిక్కులు తెచ్చిపెట్టేది. అయినా గాంధీజీ తాను స్వయంగా కోరి ఏర్పరచుకున్న సరళ మార్గాన్ని ఎన్నడూ విడనాడలేదు. ఆ మార్గంలోనే అవసర మైనప్పుడు పరిస్థితుల కనుకూలంగా చిన్న మార్పులకు మాత్రం సమ్మతించేవాడు. ఆయన ఏ సంస్కరణాన్ని సూచించినా, ఇతరులకు ఏ సలహా నిచ్చినా, వాటిని పూర్తిగా తనకు కూడా వర్తింపజేసుకునేవాడు. తనతోనే ప్రతి సంస్కరణాన్నీ ప్రారంభించేవాడు. అందువల్లనే ఆయన మాటలకూ, చేతలకూ మధ్య భేదమేమీ కనిపించేది కాదు. ఏ పరి

స్థితిలోనైనా ఆయన చిత్తశుద్ధిని ఎవరూ శంకించడానికి అవకాశం లేకపోయేది. పరాజయం ప్రాప్తించినప్పుడు కూడా ఆయన విశిష్టత వృద్ధిచెందుతూనే ఉండేది.

భారతదేశాన్ని ఆయన తన ఇచ్ఛకు, ఆదర్శాలకు అనుకూలంగా ఏవిధంగా రూపొందించాలని సంకల్పించాడు? "నేను సామాజిక వికాసానికి పాటుపడదలచుకున్న భారత భూమిలో దీనులు, దరిద్రులు దానిని తమ దేశమని భావిస్తారు. ఆ దేశపాలనలో వారికి కూడా భాగ ముంటుంది. ఆ భారతదేశంలో ఉన్నతవర్గాలవారనీ, సామాన్యులనీ భేద ముండదు. అన్ని జాతులవారూ సంపూర్ణ సామరస్యంతో జీవిస్తారు. ....ఆ భారతదేశంలో అస్పృశ్యతా దురాచారానికీ, మద్యపానం వంటి దురభ్యాసాలకూ చోటుండదు.... స్త్రీలు కూడా పురుషులతో సమంగా హక్కులను అనుభవిస్తారు.... నేను కలలు కంటున్న భారతదేశం స్వరూపమిది" అని ఆయన వ్రాశాడు.

హిందూమతం తనకు ప్రసాదించిన ఆధ్యాత్మిక సంపదకు గాంధీజీ హర్షించాడు. ఆయన హిందూమతానికి విశ్వజనీనమైన ఆకృతి నివ్వడానికి యత్నించాడు. అన్ని మతాలూ సత్యాన్ని సాధించడాని కుపకరణాలే అని ఆయన నమ్మిక. సాంస్కృతికంగా తనకు లభించిన వారసత్వాన్ని ఆయన సంకుచిత దృష్టితో చూడలేదు. "భారతీయ సంస్కృతి కేవలం హిందూ సంస్కృతి అనికాని, ముస్లిం

సంస్కృతి అనికాని, మరొక సంస్కృతి అనికాని ఎంచ డానికి వీలులేదు. అది వివిధ సంస్కృతుల సమ్మేళనం" అని ఆయన వ్రాశాడు. "సమస్తదేశాల సంస్కృతీ వాయు వులు నా ఇంటిలో స్వేచ్ఛగా ప్రసరించాలని నా ఇచ్ఛ. ఐతే వాటిలో ఏ ఒక్కటీ నన్ను పూర్తిగా వివశుణ్ణి చెయ్య కూడదు. ఇతరుల ఇళ్ళలో నేను జానిసగానో, భిక్షుకుడి గానో జీవించడానికి సమ్మతించను" అని కూడా ఆయన వ్రాశాడు. ఆధునిక భావతరంగాల తాకిడికి ఆయన కూడా గురి అయ్యాడు. ఐనా తన మౌలిక విశ్వాసాలను విడ నాడలేదు.

ఈ దృష్టితో ఆయన భారతీయులలో పాశ్చాత్య సభ్యతా సంస్కృతుల నలవరచుకున్న కొద్దిమంది విద్యా వంతులకూ, సామాన్యప్రజానీకానికీ మధ్య ఉన్న అంతరాన్ని తగ్గించి, ప్రాచీన సంస్కృతిలోని ఉత్తమాంశాలను గుర్తించి ప్రచారంచేసి, నిద్రాణమైన జాతిని మేల్కొలిపి తిరిగి ఉత్తే జితం చెయ్యడాని కుద్యమించాడు. బహుముఖంగా కనిపించే ఆయన స్వభావంలో సామాన్యప్రజలతో ఆయన తాదా త్మ్యం పొంది, దీనులతో, దళితులతో ఏకమై, కేవలం భారతదేశంలోనే కాక యావత్ప్రపంచంలోని పీడిత జను లతో సాన్నిహిత్యాన్ని పెంపొందించుకోవడం స్పష్టంగా కనిపిస్తుంది. మతం కంటె ఆయన దీనజనోద్ధరణానికే ప్రాముఖ్య మిచ్చాడు. "సగ మాకలితో మాడుతున్న జాతికి

మతం, కళ, వ్యవస్థ ఏవీ ఉండవు." "ఆకటితో అటమటించే లక్షలకొద్ది ప్రజలకు ఏ వస్తువు ఉపయోగపడుతుందో అదే నా దృష్టిలో అత్యంత సుందరమైనది. ప్రస్తుతం మనం వారికి ముఖ్యంగా అవసరమైన వస్తువులను సమకూర్చుదాం. నాగరికతా చిహ్నాలైన కళలూ, విలాసాలూ క్రమంగా తరువాత ప్రాప్తించగలవు.... అశేష ప్రజానీకానికి బోధపడే కళను, సాహిత్యాన్ని నేను వాంఛిస్తున్నాను." తిండికీ, బట్టకూ నోచుకోని అసంఖ్యాక దళిత ప్రజాసమూహాన్ని గురించి ఆయన నిత్యమూ యోచిస్తూ వుండేవాడు. "తెంపులేని జాగారమో, మైకమో - ఇదే ఈనాడు అనేక లక్షల జనుల స్థితి." "ప్రతి నేత్రంనుంచి ప్రతి అశ్రుకణాన్ని తుడవడం తన లక్ష్య" మని ఆయన చెప్పుకున్నాడు.

ఈ విధంగా అపారమైన ఆత్మవిశ్వాసంతో, అసామాన్యమైన శక్తితో, అన్నిసమస్యలను నిరుపేదల జీవన ప్రమాణోద్ధరణంతో ముడిపెట్టి, సమస్త జనుల స్వేచ్ఛా సమతలకోసం కృషిచేసిన గాంధీజీ భారతదేశంలోని అసంఖ్యాక ప్రజానీకాన్ని అయస్కాంతం ఇనుము నాకర్షించినట్టు ఆకర్షించడంలో ఆశ్చర్యపడవలసినదేమీలేదు. ఆయన గతానికీ భవిష్యత్తుకూ ముడివేసి, నిస్పృహతో నిండిన వర్తమానాన్ని ఉజ్జ్వల భవితవ్య సాధనకొక మెట్టుగా చేస్తున్నట్టు వారికి తోచింది. సామాన్యప్రజలేకాదు, విద్యావంతులూ, మేధావులూ తమ పూర్వపు అలవాటులను




పములుకోవడం కష్టమనిపించినప్పటికీ, గాంధీజీ ప్రభావానికి వారుకూడా లోనయ్యారు. ఈ విధంగా గాంధీజీ తన సహచరులలోనేగాక, ప్రతిపక్షులలోనూ, 'ఇదమిత్థం' మని నిర్ణయించలేక తటస్థంగా నిలిచిన జనంలోనూ సువిస్తృతంగా మానసిక విప్లవం సాధించాడు.

గాంధీజీ దృష్టిలో ప్రజాస్వామ్యానికి అందరూ గణించే అంకెలతో, అధిక సంఖ్యాకవర్గంతో, ప్రాతినిధ్యంతో నిమిత్తంలేదు. ప్రజాస్వామ్యానికి సేవా, త్యాగదృష్టి ముఖ్యమని ఆయన అభిప్రాయం. నైతికంగా ఒత్తిడిచేసి కోరిన మార్పులను సాధించాలి. "జన్మతః నేను ప్రజాస్వామ్యవాది" నని ఆయన చెప్పుకున్నాడు. "అతిదీన జనావళితో నన్ను నేను సమానంగా పరిగణించుకుంటూ, వారి జీవన ప్రమాణంకంటె అధికస్థాయిలో జీవించడానికి నిరాకరిస్తూ, బుద్ధిపూర్వకంగా వారితో తాదాత్మ్యం పొందడానికి యత్నిస్తూ వుండడంచేత ప్రజాస్వామ్యవాదినని చెప్పుకునే హక్కు కలిగింది." ప్రజాస్వామ్యవాదికి ఆయన నిర్వచన మిది. ప్రజాస్వామ్యాన్ని గురించి ఆయన తన అభిప్రాయాలను ఇంకా వివరించాడు. "కాంగ్రెస్ సంస్థకు ప్రజాస్వామిక సంస్థ అనే ప్రతిష్ఠ, పలుకుబడీ సంక్రమించడానికి కారణం, అది ఇతోధికంగా జనసామాన్యానికి చేస్తున్న సేవకాని, కేవలం వార్షికోత్సవాలకు వచ్చే ప్రతినిధులూ, ప్రేక్షకులూ, వారి సంఖ్యాబలమూ కాదు. పాశ్చాత్యదేశాలలో ప్రజా

స్వామ్యవ్యవస్థ క్లిష్టపరీక్ష నెదుర్కొంటున్నది. ఈ వ్యవస్థను విజయవంతంగా కొనసాగించి ప్రజాస్వామ్య సాధన మార్గాన్ని ప్రపంచానికి చాటిచెప్పే భాగ్యం భారతదేశానికి ప్రాప్తిస్తే బాగుంటుంది.

ఈనాడు ప్రజాస్వామ్యం తప్పొసరిగా లంచగొండితనానికీ, వంచనకూ దారితీస్తున్నది. ఇట్లా జరుగనీయ కూడదు. పైగా ప్రజాస్వామ్యానికి సంఖ్యాబలమే గీటురాయి కాకూడదు. అల్ప సంఖ్యాకులు తాము ప్రాతినిధ్యం వహించే సామాన్య పౌరుల ఆశలను, ఆశయాలను, ఉత్సాహాన్ని ప్రకటించగలిగితే, అది ప్రజాస్వామ్యం కాదనడానికి వీలులేదు. బలవంతంగా ప్రజాస్వామ్యవ్యవస్థను నెలకొల్పడం సాధ్యం కాదని నా నమ్మకం. అది సహజంగా తనంతట ఏర్పడాలి గాని, బలవంతంగా ప్రజాస్వామ్య భావనను మనం ప్రజలలో కలిగించలేము."

ఈ భావాలు పాశ్చాత్య దేశాలలో వ్యాప్తిలోవున్న ప్రజాస్వామ్యానికి భిన్నంగా వున్నట్టు గాంధీజీ ఒప్పుకున్నాడు. నిజానికీ అభిప్రాయాలకు కమ్యూనిజం ఊహించే ప్రజాస్వామ్యంతో కొంత పోలిక ఉంది. సామాన్య జనానికి తెలిసినా, తెలియకపోయినా వారి అవసరాలను, వాంఛలను కొద్దిమంది కమ్యూనిస్టులు వెల్లడించగలరని వారి సిద్ధాంతం. ఐతే ఈ పోలిక చాలా కొద్దిపాటిది. కమ్యూనిజానికీ, గాంధీజీ ఊహించిన ప్రజాస్వామ్యానికీ భేదాలే చాలా ఎక్కువ. ఈ రెండిటి దృక్పథాలే వేరు. లక్ష్యసిద్ధికి

ఎంచుకొన్న మార్గాలలోనూ, బలప్రయోగపు ఔచిత్యా నౌచిత్యాలను గూర్చిన నమ్మకాలలోనూ ఈ భేదం మరీ ఎక్కువగా కనిపిస్తుంది.

గాంధీజీ ప్రజాస్వామ్యవాది అయినా, కాక పోయినా, ఆయన నిశ్చయంగా భారతదేశంలోని అసంఖ్యాక శ్రామిక కర్షకజనానికి ప్రాతినిధ్యం వహించాడు. వ్యక్తా వ్యక్తంగావున్న వారి సంకల్పాన్ని ఆయన తనలో మూర్తీ భవింప జేసుకున్నాడు. ఆయన సామాన్య కర్షకుడు కాని మాట నిజమే. ఆయన సునిశితబుద్ధి, సంస్కారం, విశాల దృక్పథం, స్నేహార్ద్ర హృదయం, సంయమం, జనులను సమ్మోహితంచేసి వారితో గాఢమైన అనుబంధాల నేర్పరచు కోవడానికి కారణమైన అద్వితీయమైన ఆకర్షణశక్తి - ఈ లక్షణాలన్నీ సామాన్య కర్షకజనంలో ఉండవు. అయినా ఆయన ఒకవిధంగా కర్షకోత్తముడనే చెప్పాలి. ఆయన ప్రతిసమస్యను శ్రామిక కర్షకజన దృక్పథంతోనే చూసే వాడు. కర్షకులవలెనే ఆయన కూడా మానవ సమాజం లోని కొన్ని అంశాలను గురించి ఏ మాత్రం పట్టించుకునే వాడు కాదు. అయితే భారతదేశం ముఖ్యంగా కర్షకుల దేశం. అందుచేత ఆయనకు భారతీయ జన సామాన్యం ఏక్షణాన ఎట్లా ఊహిస్తున్నదో, ఎప్పుడు ఏపరిస్థితి ఎట్లా పరిణమిస్తుందో చక్కగా తెలుసు. తగిన సమయం చూసి ఆయన కార్యాచరణ కుద్యమించేవాడు.

ఆయన సిద్ధాంతాలు కొన్ని అభివృద్ధినిరోధకంగా కనిపించినా, క్రియలో మాత్రం ఆయన వర్తమాన భారత దేశ చరిత్రలో అత్యంత ప్రముఖ విప్లవవాది అని చెప్పుకోవాలి. ఆయన అసాధారణ వ్యక్తి గనుక ఆయన వ్యక్తిత్వాన్ని సామాన్య ప్రమాణాలతో నిర్ణయించడానికి వీలు కాదు. తర్కశాస్త్ర సూత్రాలతో ఆయన ఆచరణను అర్థం చేసుకోవడం కూడా అసాధ్యం. అయితే అంతరంగంలో ఆయన విప్లవవాది గనుకనూ, దేశ స్వాతంత్ర్య సంపాదనకు దీక్షాకంకణం ధరించాడు గనుకనూ స్వాతంత్ర్య సంసిద్ధి కలిగేవరకు ఆయన పట్టువిడువకుండా పోరాటం సాగించాడు. ఈ పోరాటంలో ఆయన అసంఖ్యాక ప్రజానీకాన్ని కార్యోన్ముఖులను గావించాడు. క్రమంగా సాంఘిక పరిణామానికి కూడా కారకుడయ్యాడు.

ముఖ్యంగా పడకకుర్చీ సోషలిస్టులు గాంధీజీని అభ్యుదయ నిరోధక శక్తులకు ప్రతినిధిగా చిత్రిస్తూ, తమ వాదాన్ని హేతువాదరీత్యా సమర్థిస్తారు. ఆయన అభ్యుదయ నిరోధక వర్గానికి చెందినవాడే కావచ్చుగాక. అయినా విప్లవవాదులమని చెప్పుకునేవారి కెవరికీ చేతగానంతగా ఆయన భారతీయ ప్రజా హృదయాన్ని అర్థం చేసుకో గలిగాడు. భారతదేశాన్ని పూర్తిగా కదిపివేయగలిగాడు.

అభివృద్ధి నిరోధకుడైనా, విప్లవనాయకుడైనా ఆయన భారతదేశ స్వరూపాన్ని పూర్తిగా మార్చివేసి, బానిసలై

క్రుంగిపోయిన ప్రజలకు తిరిగి ఆత్మ గౌరవాన్ని ప్రసాదించి, జనసామాన్యంలో శక్తినీ, రాజకీయచైతన్యాన్నీ కలిగించి, భారతదేశ సమస్యను ప్రపంచ సమస్యగా రూపొందించ గలిగాడు. ఆయన సాధించదలచిన లక్ష్యం, దాని నైతిక సమంజసతల మాట అటుండగా, తన లక్ష్యసిద్ధికై ఆయన రూపొందించుకొన్న శాంతియుత సహాయ నిరాకరణం సత్యాగ్రహం నిశ్చయంగా ఆయన భారతదేశానికీ, ప్రపంచానికీ ప్రసాదించిన అమోఘాస్త్రాలు. మనదేశపు స్థితిగతులకు అవి అన్నివిధాల తగినవి.

ఆధునిక దృక్పథానికీ, గాంధీజీ దృక్పథానికీ చాలా భేదమున్న మాట వాస్తవమే. ఆధ్యాత్మిక, నైతిక ప్రమాణాలలో పతనం చెందుతూ, భౌతికంగా మాత్రం జీవన ప్రమాణాన్ని పెంచుకుంటూ భోగమయజీవితం గడపడం ఆయనకు ఆకర్షణీయంగా కనిపించలేదు. విలాసలాలసమైన జీవితాన్ని ఆయన వాంఛించలేదు. కఠినమార్గమే సరళ మార్గమని, భోగలాలసత్వం నైతికపతనానికి దారితీస్తుందని ఆయన విశ్వాసం. ముఖ్యంగా జీవితవిధానంలోనూ, అభి వృద్ధికి అవకాశాలలోనూ ధనికులకూ, పేదలకూ మధ్య ఎంతటి అగాధమున్నదో గమనించి ఆయన బాధపడ్డాడు. తన ఆత్మ సంతృప్తికోసం ఆయన కోరి పేదలలో చేరిపోయి, వారికి అందుబాటులో ఉండే జీవన ప్రమాణాన్నే తనకు కూడా ఎంచుకున్నాడు. వారివలెనే ఆయనకూడా

కొల్లాయిగుడ్డ కట్టుకున్నాడు. కొద్ది మంది ధనికులకు, లక్షలకొద్ది సామాన్యజనులకూ మధ్య ఇంతటి అంతరం ఉండ డానికి ప్రధానకారణాలు రెండనీ, వాటిలో మొదటిది మన దేశ సంపదను కొల్లగొడుతున్న విదేశీయ పరిపాలన అనీ, రెండవది పెట్టుబడిదారీ విధానం ప్రాతిపదికగా యంత్రా లకు ప్రాధాన్య మిచ్చే పాశ్చాత్య పారిశ్రామికయుగ నాగరికత అనీ గాంధీజీ భావించాడు. ఈ రెండిటిని ఆయన ప్రతిఘటించాడు. ఆయన దృష్టి స్వయంసమృద్ధితో, పరా ధీనత లేకుండా సుఖంగా జీవితం గడపడానికి వీలిచ్చిన ప్రాచీన గ్రామీణ వ్యవస్థ మీదికి మరలింది. ఆయన కది చాలా నచ్చింది. ఎందుచేతనంటే ఆ గ్రామాలలో ఉత్పత్తి, పంపకం, వినియోగం సరియైన పాళ్ళలో జరిగేవి. నేటివలె ఆర్థిక రాజకీయాధికారాలు ఒక్కచోట కేంద్రీకృతమై వుండక, గ్రామస్థులందరి చేతులలో ఉండేవి. ఒకవిధంగా ప్రజాస్వామ్య వ్యవస్థ నెలకొని వుండేది. ధనికులకు, దరిద్రు లకు మధ్య ఇప్పటివలె పెద్ద అంతరం ఉండేదికాదు. నేటి నాగరిక జీవితానికి సంబంధించిన వ్యసనాలు కానవచ్చేవి కావు. పట్టెడన్నంపెట్టి పోషించే భూమినే నమ్ముకుని ప్రజలు ఆరుబయళ్ళ నుంచి వీచే శుభ్రవాయువులను పీల్చుతూ సంతృప్తితో బ్రతికేవారు.

జీవితధ్యేయాన్ని గురించి గాంధీజీ దృక్పథానికీ, ఆధు నిక దృక్పథానికీ ఈ విధంగా మౌలికమైన భేదమున్నది.

ఆయన భాషలోనూ, కార్యకలాపాలలోనూ ఈ భేదం స్పష్టంగా గోచరించేది. ఆయన వ్రాతలలో అనాదిగా మానవ సమాజంలో అంతటా, ముఖ్యంగా భారతదేశంలో, ప్రచారంలో ఉన్న ఆధ్యాత్మిక నైతిక బోధలు ప్రతి ఫలించేవి. నైతిక ప్రమాణాలే ప్రధానం. ఎంతటి ఉత్తమ లక్ష్యమైనా, వక్రసాధనాలతో దానిని పొందడానికి ప్రయత్నించకూడదు. లక్ష్యం ఎంతముఖ్యమో, సాధనోపకరణాలు కూడా అంతేముఖ్యం. వంకరదారులలో ఉత్తమ లక్ష్యం సాధించగోరే వ్యక్తిగాని, జాతిగాని పతనం చెందక తప్పదు. ఈ అంశాలను ఆయన మాటిమాటికీ చెప్పుతూవుండేవాడు.

అయితే ఆయన జీవిత సమస్యలకు దూరంగా స్వాప్నికజగత్తులో విహరించేవాడు కాడు. వ్యాపార రహస్యాలన్నీ కూలంకషంగా నేర్చిన వణిక్ప్రముఖులకు నెలవైన గుజరాత్ ఆయన జన్మస్థలం. మనదేశపు పల్లెటూళ్ళనుగురించి, గ్రామీణ జీవితాన్నిగురించి అందరికంటె ఎక్కువగా ఆయనకు తెలుసు. ఈ అనుభవం వల్లనే ఆయన చరఖాను, కుటీరపరిశ్రమలను తన కార్యక్రమంలో చేర్చుకున్నాడు. కొంతవరకుగాని, పూర్తిగా గాని పనీ, పాటా లేక గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్న అసంఖ్యాక జనానికి వెంటనే ఏదైనా బ్రతుకుతెరువు చూపాలన్నా, వారిలో వ్యాపిస్తున్న నిస్పృహను అరికట్టాలన్నా, గ్రామీణ ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచాలన్నా, వారిలో పరా

ధీనబుద్ధిని పోగొట్టి ఏ మాత్రంగానైనా స్వశక్తిపై ఆధార పడడం నేర్పాలన్నా, ఎక్కువగా పెట్టుబడి లేకుండానే ఇవన్నీ సాధించాలంటే అంతకంటె వేరే మార్గం లేక పోయింది. ఒకవంక దేశసంపదను కొల్లగొడుతున్న విదేశీయ పరిపాలన మూలకంగా పెద్ద పెట్టున సంస్కరణలను ప్రవేశపెట్టడానికి వీలులేకపోవడం అటుండగా, ఎక్కువ పెట్టుబడి లేని స్థితిలో పనిలేకుండా కూర్చున్న అసంఖ్యాక కార్మిక జనానికి ఎట్లా ఏదో జీవనోపాధి కల్పించాలనేది ఆనాడు భారతదేశంలో ముఖ్యసమస్యగా పరిణమించింది.

కొందరు వ్యర్థంగా మనిషిచేసే పనిని యంత్రం సాధించగల పనితో పోల్చి వ్యాఖ్యానిస్తూవుంటారు. ఒక్క భారీ యంత్రం వెయ్యిమంది పనిని, పదివేల మంది పనిని చెయ్యగలదు. కాదని ఎవరూ అనరు. కాని ఆ యంత్రాన్ని నెలకొల్పడంవల్ల ఆ పదివేలమంది పని లేక ఆకలితో మాడుతూవుంటే సాంఘికంగా అది లాభదాయకం కాదు. చాలా కాలం గడిచాక, సామాజిక పరిస్థితులే మారి పోతే, అప్పుడది లాభదాయకం కావచ్చు! కాని తాత్కాలికంగా నష్టమే కలుగుతుంది. అసలాయంత్రమే అక్కడ లేకపోతే ఈ పోలికకు అవకాశమే లేదు. అందుబాటులో వున్న శ్రామిక జనమంతటికీ పని దొరుకుతుంది. వ్యక్తిగతంగా చూసినా, జాతిపరంగా చూసినా ఇది లాభదాయకమే. కొత్తగా నిరుద్యోగాన్ని పెంచడానికిగాక, కార్మికు

లందరికీ పని కల్పించడానికి యంత్రాలను పెద్దపెట్టున నెలకొల్పగలిగితే మంచిదే.

తన మూలసిద్ధాంతాలకు సంబంధించినంతవరకు గాంధీజీ ఏమాత్రం పట్టు విడువకుండా, నిశ్చలంగా నిలిచేనాడు. ఐనా మారే పరిస్థితులను, ప్రజల బలాబలాలను గమనించి, జనసామాన్యం తన సంకల్పాని కనుకూలంగా ముందుకుసాగడం ఎంతవరకు సాధ్యమవుతుందో అంచనా వేసి, సందర్భాన్నిబట్టి తన ప్రణాళికలను తగినట్టు మార్చడానికి ఆయన సంకోచించలేదు. ఐతే అప్పుడప్పుడు ఆయన ఆత్మపరీక్ష చేసుకుని, పరిస్థితులతో రాజీచేసుకోవడంలో తన ఆశయాలకేమైనా హాని కలుగుతుందేమోననే సంకోచంతో తిరిగి తన స్థావరం చేరుకునేవాడు. కార్యాచరణ కుద్యమించినప్పుడు ఆయన ప్రజాహృదయాన్ని గ్రహించి తదనుగుణంగా నడిచేవాడు. కేవలం సిద్ధాంతాలను ప్రతిపాదిస్తున్నప్పుడు మాత్రం రాజీకి, మార్పులకు అవకాశం లేకుండా తన ఆశయాలను ప్రకటించేవాడు.

ప్రజల భావనపై, ఆదర్శాలపై ఒక వ్యక్తి ప్రభావం ఎంత గాఢంగా ఉండగలదో నిర్ణయించడం కష్టం. చరిత్ర చదివితే కొందరు వ్యక్తులు సమకాలిక సమాజాలను చాలా ఎక్కువగా ప్రభావితం చేసినట్టు కనిపిస్తుంది. అయితే వారు ఆ యుగపు ప్రజల హృదయాంతరాలలో అణిగివున్న ఆలోచనలకే స్పష్టమైన రూపాన్నిచ్చి లోకానికి చాటారేమో!

ఈ కాలపు భారతీయుల భావనపై గాంధీజీ ప్రభావం చాలా అధికంగా కనిపిస్తుంది. ఇది ఎంతకాలం ఏ రూపంలో నిలిచివుంటుందో భవిష్యత్తులోనే తెలుస్తుంది. ఆయన ప్రభావం కేవలం ఆయనతో ఏకీభవించి, జాతీయ నాయకునిగా ఆయన అడుగుజాడలలో నడిచినవారికి మాత్రమే పరిమితం కాలేదు. ఆయనతో అభిప్రాయ భేదాలుండి, ఆయనను విమర్శించినవారిమీద కూడా ఆ ప్రభావం ప్రసరించింది. ఆయన అహింసా సిద్ధాంతాన్నిగాని, ఆర్థిక సిద్ధాంతాలనుగాని పూర్తిగా ఆమోదించే భారతీయులు చాలా కొద్దిమంది మాత్రమే వుంటారు. ఐనా అనేకులు ఏదో రూపంలో వాటి ప్రభావానికి లోనై వుంటారు.

నిత్యజీవితంలోని ఇతర సమస్యలతోబాటు రాజకీయ సమస్యలను కూడా నైతిక దృష్టితోనే పరీక్షించి పరిష్కరించుకోవాలని గాంధీజీ అన్నాడు. ఇందుకు ఆయన ఆధ్యాత్మిక గ్రంథాలలోని బోధనలను ఆధారంగా ఉదాహరించాడు. మతవిశ్వాసాలున్నవారికి ఈ వాదంలోని మత ప్రసక్తి నచ్చింది. నైతికదృష్టి ఇతరులను కూడా ఆకర్షించింది. గాంధీజీ మూలాన ఎందరెందరో కార్యాచరణలో నైతికంగా ఉన్నతస్థాయి నందుకోగలిగారు. ఇతరులు కనీసం ఆ దృష్టితో ఆలోచించడం నేర్చుకున్నారు. ఆ ఆలోచన కూడా వారి ప్రవర్తనను, ఆచరణను కొంతవరకు మార్చగలిగింది. రాజకీయ వ్యవహారాలంటే కేవలం సమ

యానుకూలంగా సిద్ధాంతాలను మార్చుకునే అవకాశ వాదంగానే అంతటా చెల్లుబడి అవుతున్నది. మనదేశంలో మాత్రం కార్యాచరణకు ముందు నైతికభావమథనం జరిగేది. వెంటనే ఏది సాధ్యం, ఏది వాంఛనీయం అని ఆలోచించక తప్పదు. అయితే చివరకు దాని ఫలితం ఏవిధంగా రూపొందు తుందని కూడా ఆలోచించి అప్పుడే కార్యాచరణకు దిగాలి.

మనదేశంలో ఈ రంగాలలో గాంధీజీ ప్రభావం బహుముఖంగా వ్యాపించింది. ఈనాటికీ నిలిచి వుంది. అయితే ఆయన భారత జాతీయనాయకులలో అగ్రగణ్యుడు కావడానికి కారణం ఆయన అహింసా సూత్రంకాని, ఆర్థిక సిద్ధాంతాలుకాని కావు. అసంఖ్యాక భారతీయుల దృష్టిలో ఆయన భారతస్వాతంత్ర్యాకాంక్షకు, జాగృత దేశభక్తికి, జాతి గౌరవాన్ని మంటగలుప జూచే దుష్టశక్తులను ప్రతిఘటించే దృఢసంకల్పానికి ప్రధాన చిహ్నంగా రూపొందాడు. భారతీయులలో అనేకులు ఇతర సమస్యలలో ఆయనతో ఏకీభవించకపోయినా, కొన్ని సందర్భాలలో ఆయనను విమర్శించి విడిపోయినా, దేశ స్వాతంత్ర్య సంసిద్ధికై కార్యాచరణకు నడుము బిగించవలసివచ్చినప్పుడు మాత్రం వారు ఆయన దగ్గరికే చేరి ఆయననే తప్పనిసరిగా తమ నాయకునిగా స్వీకరించేవారు.

గతంలోకాని, వర్తమానంలోకాని మరెవ్వరికీ సాధ్యం కానంత ఎక్కువగా గాంధీజీ భారత ప్రజాహృద

యాన్ని గ్రహించాడు. ఆయన భారతదేశంలో అనేక ప్రాంతాలను పర్యటించి అనేక లక్షల జనులను కలుసుకున్నాడు. అంతేకాదు, ఆయనకు జనసామాన్యంతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకోగల శక్తి ఉండేది. ఆయన పూర్తిగా వారిలో చేరిపోగలిగేవాడు. ఆ సంగతి వారెరుగుదురు. అందుకే వారు ఆయనపట్ల అకుంఠిత భక్తి విశ్వాసాలను ప్రదర్శించారు.

ఆయన భారతదేశాన్ని, భారతీయులను చాలా చక్కగా అర్థంచేసుకున్నాడు. దేశచరిత్ర అంటే గాంధీజీకి ప్రత్యేకమైన అభిమానం లేకపోయినా, కొందరిలో గోచరించే చారిత్రకదృష్టి ఆయనలో కనిపించకపోయినా, ఆయన భారతీయుల సభ్యతా సంస్కృతుల పునాదులను చక్కగా అర్థంచేసుకున్నాడు. ప్రపంచంలోని వివిధ దేశాల వర్తమానవ్యవహారాలను ఆయన శ్రద్ధగా తెలుసుకుంటూ వుండేవాడు. అయితే దృష్టినిమాత్రం భారతదేశవ్యవహారాలమీదనే కేంద్రీకరించేవాడు. ఏ సమస్యను గురించి యోచించినా, ఆయన ప్రధానాంశాన్ని గ్రహించి మిగిలిన అంశాలను విడిచివేసేవాడు. ప్రతిసమస్యను నైతిక దృక్పథంతో పరీక్షించేవాడు గనుక ఆయనకు దానిమేలు కీళ్ళను గూర్చిన దీర్ఘదృష్టి, సమస్యను స్పష్టంగా అర్థంచేసుకోగల గ్రహణశక్తి అలవడేవి. తాత్కాలికంగా గాంధీజీ ఎత్తుగడలు విఫలమైనా, ఆయన కార్యాచరణ ప్రణాళిక

మాత్రం ఫలసిద్ధికి తోడ్పడుతుందని బెర్నార్డ్ షా అన్నాడు. అయితే చాలామంది చివరకు విజయం సిద్ధిస్తుందా, లేదా అని ఆలోచించరు. వారు కోరేది తాత్కాలికలాభమే.

కాంగ్రెస్ సంస్థను ఆయన శాసించేవాడు. అయితే ఆ సంస్థపై ఆయన అధికారం చిత్రమైనది. ఎందుచేతనంటే కాంగ్రెస్ సంస్థలో భిన్నాభిప్రాయాలకు చోటుండేది. సచేతనంగా, బహుముఖవ్యాప్తంగా, విప్లవాత్మకంగా రూపొందిన ఆ సంస్థను సులభంగా ఒక దారికే ఈడ్వడానికి వీలయ్యేది కాదు. తరుచుగా ఇతరుల ఇచ్ఛను మన్నిస్తూ గాంధీజీ తన సంకల్పంలో కొద్దిపాటు మార్పు చేసుకునేవాడు. ఒక్కొక్కప్పుడు పూర్తిగా వ్యతిరేకాభిప్రాయానికి కూడా ఒప్పుకునేవాడు. కొన్ని ముఖ్యసమస్యలను గురించి మాత్రం ఆయన చాలా పట్టుదలగా ఉండేవాడు. అందుచేత కొన్ని సారులు ఆయన కాంగ్రెస్ సంస్థకు దూరం కావలసివచ్చింది. అయినా ఆయన సదా భారత స్వాతంత్ర్యానికి, నవజాగృత దేశభక్తికి ప్రతీకగా రూపొందాడు. భారత దేశాన్ని పరాధీనం గావించగోరే ద్రోహులకు సింహ స్వప్నంగా గోచరించాడు. అందుకే మిగిలిన సమస్యలపట్ల ఆయనతో అభిప్రాయభేదాలున్నా, స్వాతంత్ర్యసమరంలో ప్రజలందరూ ఆయన నాయకత్వాన్ని ఆమోదించారు. పోరు లేనప్పుడు అందరూ ఆయన నాయకత్వానికి ఒప్పుకునేవారు కాదు. కాని జాతీయ సమరం సాగినప్పుడు భేదాలను విస్మరించి అందరూ ఆయన నాయకత్వంతోనే ముందుకు సాగేవారు.

కాంగ్రెస్ సంస్థ ద్వారా గాంధీజీ సాగించిన మహత్తర స్వాతంత్ర్యోద్యమ పరంపరలోనే ఆయన దేశానికి, జాతికి చేసిన సేవ కనిపిస్తుంది. దేశవ్యాప్తమైన ఉద్యమం ద్వారా ఆయన ప్రజలలో నవోత్తేజం కలిగించాడు. ప్రతి నిరంకుశశక్తికీ దాసోహమంటూ, ప్రతిఘటించే శక్తిని కోల్పోయి, నిస్పృహతో నీరసించిన పీడిత జనులలో, తిరిగి ఆత్మగౌరవాన్ని, ఆత్మవిశ్వాసాన్ని ప్రతిష్ఠించి, దౌర్జన్యాన్ని ఎదిరించగల శక్తిని, సంఘటితంగా కార్యాచరణ కుద్యమించి, ఎటువంటి త్యాగానికైనా వెనుదీయని ధైర్యాన్ని ప్రజ్వలింపజేశాడు. వారికి ఆర్థిక రాజకీయ సమస్యలను గురించి ఆలోచించడం నేర్పాడు. అప్పుడు ఏ ఊళ్ళో చూసినా, ఏ వీధిలో చూసినా ఈ నూతనభావాలను గురించి, ఆశలను గురించి ప్రజలు చర్చిస్తూవుండేవారు. ప్రజలలో వచ్చిన ఈ మానసిక పరిణామం చాలా ఆశ్చర్యకరమైనది. అందుకు కాలం కలిసివచ్చింది. ప్రపంచపరిస్థితులుకూడా మన ప్రజలలో ఈ మార్పు రావడాని కనుకూలించాయి. అయితే అనుకూల పరిస్థితులను గ్రహించి జాతి అభ్యుదయానికై కృషిచేయడానికి ఉత్తమనాయకుడు కావాలి. అట్టి నాయకుడు గాంధీజీ. శతాబ్దాలనుంచి మన మనస్సులను బంధించిన సంకెళ్ళను ఆయన విడగొట్టాడు. అప్పుడు ప్రజలలో ఆ విముక్తివలన కలిగిన ఉత్సాహం, చైతన్యం అనుభవించినవారెవరూ మరచిపోలేరు. దేశంలోని పరిస్థితులను, సామాన్యప్రజల ఊహాపోహాలను స్పష్టంగా గ్రహిం

చినవాడు గనుకనే గాంధీజీ మనదేశ చరిత్రలో అతి ముఖ్యమైన విప్లవాన్ని సాధించగలిగాడు. సిద్ధాంతరీత్యా ఆయనకంటె ప్రగతిపథంలో నడిచే రాజకీయ పక్షాలు దేశంలోని స్థితిగతులను, ప్రజాహృదయాన్ని గ్రహించక పోవడంచేత వారి కార్యకలాపాలు ఎక్కువగా ఏమీ సాధించలేకపోయాయి.

శక్తివంతమైన వాయుతరంగం వీచినప్పుడు దీర్ఘ నిశ్వాసం తీసినట్టు, చీకట్లను భేదించే కాంతికిరణం ప్రసరించి నప్పుడు కనుమూతలు విడినట్టు, సుడిగాలి వీచినప్పుడు అన్నీ చెదిరిపోయినట్టు గాంధీజీ రాకతో ప్రజలలో బ్రహ్మాండమైన మార్పువచ్చింది. వారి పూర్వవైఖరులు చెదిరిపోయాయి. ఆయన ఆకాశంనుంచి దిగిరాలేదు. భారతీయ జనసామాన్యం నడుమనుంచి ఆయన వచ్చాడు. వారి దృక్పథంతోనే మాట్లాడుతూ అందరి దృష్టిని వారి నికృష్ట స్థితిమీదికి ఆకర్షించాడు. "ఈ నిర్భాగులను కొల్ల గొడుతూ, వారిని అధోగతిపాలు చేసి, మీరు సుఖభోగాలను అనుభవించడం మానండి. ఈ దారిద్ర్యానికి, దౌర్భాగ్యానికి దారితీసే వ్యవస్థను అంతం చెయ్యండి" అని ఆయన హెచ్చ రించాడు.

సదా ప్రజాసంక్షేమాన్ని పరమలక్ష్యంగా భావిస్తూ, ఆయన నిర్భయాన్ని, సత్యాన్ని, వీటితో కూడిన ఆచరణను ప్రబోధించాడు. వ్యక్తికిగాని, జాతికిగాని సర్వోత్కృష్ట

మైన దానం 'అభయ'మని మన ప్రాచీన గ్రంథాలు ఘోషిస్తున్నవి. అభయమంటే కేవలం శారీరకమైన ధైర్యమే కాదు, మానసికంగా కూడా భయంలేని స్థితి అన్నమాట. నాయకులు తమ ప్రజలలో భయం లేకుండా చెయ్యాలని చారిత్రక విభాత వేళనే చాణక్యుడూ, యాజ్ఞవల్క్యుడూ పేర్కొన్నారు. కాని బ్రిటిష్ ప్రభుత్వపాలనలో దేశ వ్యాప్తంగా మనిషిని క్రుంగదీసే భయమే బహుముఖాల విజృంభించింది. ఒక వంక పోలీసుల భయం, సైన్యాల భయం, గూఢచారుల భయం, మరొకవంక నిరంకుశాధి కారుల భయం, ప్రజల నణచి వుంచడాని కేర్పడిన రాజశాస నాల భయం, కారాగృహప్రాప్తి భయం, జమిందారు ప్రతినిధి భయం, ఋణదాత భయం, సదా సమీపములోనే పొంచివున్న నిరుద్యోగ భయం, ఇట్లా ఆ రోజులలో ఎటు చూసినా ప్రజలలో భయమే వ్యాపించి, వారిని నిరాశతో, నిస్పృహతో నింపివేసింది. ఈ విధంగా అంతటా భయం విజృం భించినప్పుడే గాంధీజీ ప్రశాంత గంభీరకంఠంతో "భయపడ కండి" అని ప్రబోధించాడు.

అంత మాత్రం చేతనే ప్రజలలో భయం తొలగి పోయిందని చెప్పడానికి వీలులేదు. అయితే భయంవల్ల ప్రజ లలో ఎన్నో మిథ్యాకల్పనలు వ్యాపిస్తాయి. ఉన్న పరిస్థితిని ప్రశాంతంగా పరిశీలించి, అందుకు మానసికంగా సిద్ధపడి నప్పుడే అపోహలూ, మిథ్యాకల్పనలూ చెదిరిపోతాయి.

అందుచేత హఠాత్తుగా ప్రజలను క్రుంగదీస్తున్న భయపు ముసుగు జారిపోయింది. అసత్యానికీ, భయానికీ స్నేహం. అభయం ఉన్నచోట సత్యం ఉంటుంది. భారత దేశ ప్రజలందరూ ఒక్కమాటే మునుపటికంటె సత్యవంతు లయ్యారని కాదు, వారి స్వభావం పూర్తిగా మారిపోయిం దనీకాదు, కాని మార్పు నిశ్చయంగా కనిపించింది. అబద్ధా లకూ, రహస్యప్రవృత్తికీ అవసరం తగ్గిపోయింది. అది మహత్తరమైన మానసిక పరిణామం. మనస్తత్వ శాస్త్రజ్ఞు డైన వైద్యుడు రోగి గతచరిత్రను క్షుణ్ణంగా అర్ధంచేసుకుని, మనోవ్యధకు కారణాలను కనిపెట్టి రోగికి చెప్పి అతనిని రోగవిముక్తుణ్ణి చేసినట్టయింది.

అంతేకాదు. మన జాతిని అవమానించి అధోగతి పాలుచేసిన విదేశీయ ప్రభుత్వపాలనకు ఇంతకాలం లోబడి వున్నందుకు సిగ్గూ, ఇక ఏ పరిస్థితిలోనైనా దానిని ధిక్క రించి స్వరాజ్యం సంపాదించి తీరాలనే పట్టుదలా ప్రజలలో వ్యాపించాయి. మునుపటికంటె అధికంగా మనం సత్య వంతులం కాలేకపోయామేమో కాని, మనల్ని మందలించి సత్యం వంకకు మరల్చడానికి సర్వదా అప్రతిహత పత్యానికి చిహ్నంగా గాంధీజీ మన యెదుట నిలిచాడు.

ఏది సత్యం అని ప్రశ్నిస్తే, నిశ్చయంగా సమాధానం చెప్పలేను. మనం సత్యం అని నమ్మేవన్నీ సాపేక్షమైనవే నేమో. సంపూర్ణ సత్యం మన గ్రహణశక్తి కతీతమేమో. వివిధజనులు సత్యాన్ని గురించి వివిధాభిప్రాయాలను

వెల్లడిస్తారు. వారు పుట్టి పెరిగిన వాతావరణాన్ని బట్టి, పొందిన శిక్షణను బట్టి, ప్రేరణనుబట్టి వారి అభిప్రాయాలేర్పడతాయి. గాంధీజీకూడా ఆ విధంగానే సత్యాన్నిగురించి తన అభిప్రాయాన్ని రూపొందించుకున్నాడు. ప్రతివ్యక్తీ తన బుద్ధికి, హృదయానికి నమ్మదగినదని తోచినదానినే సత్యమని భావిస్తాడు. అతనికి సంబంధించినంత వరకు అది సత్యమే. ఈ నిర్వచనం ప్రకారం గాంధీజీవలె సత్యాన్ని ఆరాధించిన మరొకవ్యక్తి ఎవరూ నాకు కనిపించలేదు. ఈ సత్యవ్రతం రాజకీయవాదులలో ప్రమాదకరమైన లక్షణం. ఎందుచేతనంటే మనస్సులో ఉన్నమాటను గాంధీజీ ప్రజలకు వెల్లడించేవాడు. ఆయన మానసిక పరిణామాలను వారు గమనించడానికి వీలయ్యేది. గాంధీజీ ప్రభావం మనదేశంలో అనేక లక్షల జనులమీద ప్రసరించింది. ఆయన మూలాన కొందరు తమ జీవిత విధానాన్నే పూర్తిగా మార్చుకున్నారు. మరికొందరు ఏకొంచెమో మారారు. కొందరిమీద ఆయన ప్రభావం క్రమంగా సన్నబడింది. అయితే పూర్తిగా అంతరించలేదు అట్లా అంతరించే ప్రభావం కాదది.

గాంధీజీని శాంతివాదులలో లెక్కించవలసినదే కాని. ఆయన కర్తవ్యాలన్నీ వదులుకుని మూలకూర్చునే శాంతివాది మాత్రం కాదు. ఎప్పుడూ ఉత్సాహంతో, దీక్షతో తన కృషిని సాగిస్తూనే వుండేవాడు విధికిగాని, దుర్మా

ర్గానికిగాని లొంగిపోవడమంటూ లేదు. ఎప్పుడూ కుటిలత్వాన్ని ఆయన ప్రతిఘటిస్తూ వుండేవాడు. అయితే శాంతియుతంగా, సభ్యతకు భంగం లేకుండా ప్రతిఘటించేవాడు.

భారతీయులు కార్యశూరులు కారని, వారిది మారు మాట్లాడకుండా పరిస్థితులకు లొంగిపోయి కాలక్షేపం చేసే మనఃప్రవృత్తి అని కొందరంటారు. ఈ విమర్శ నిరాధారమైనది కాదు. బహుశా సుదీర్ఘ చరిత్రగల జాతులకు, తరతరాలుగా వేదాంతప్రభావానికి లోనైందున ఈ విధంగా కార్యాచరణపట్ల విముఖత్వం కలుగుతుందేమో. అయితే గాంధీజీ అచ్చమైన భారతీయుడైనా, ఆయనలో ఈ ధోరణి కనిపించదు. ఆయన ఎప్పుడూ అమితోత్సాహంతో తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూనే వుండేవాడు. స్వయంగా కష్టించి పనిచేసేవాడు. సహచరులను శాసించి పని చేయించేవాడు. తమ పరిస్థితులను ప్రతిఘటించకుండా 'ఇది అంతా పురాకృత కర్మఫలం' అని సరిపెట్టుకుంటూ కూర్చునే భారతీయ మనస్తత్వాన్ని ఆయన అందరికంటె ఎక్కువగా ఎదిరించి, మార్చడానికి తోడ్పడ్డాడు.

ఆయన మమ్మల్ని పల్లెటూళ్ళకు పంపాడు. "కష్టించి పనిచెయ్యం" డనే నూతన సందేశాన్ని మోసుకువచ్చిన ప్రచారకుల సందడితో పల్లెపట్టులు నిండాయి. రైతులలో సంచలనం కలిగింది. వెనుకటి నిదురమబ్బులు విడిపో

యాయి. మాలో మరొకవిధమైన మార్పు వచ్చింది. అది కూడా గాఢమైనదే. ఎప్పుడూ వెన్నాడే ఆకలితో భూమినే ఆశ్రయించుకొని బ్రతికే రైతులను మేము జీవితంలో మొదటిసారి సన్నిహితంగా చూడగలిగాము. భారత దేశపు ఆర్థిక సమస్యలను మేము ఈ విధంగా పుస్తకపఠనం వల్లనూ, శాస్త్రచర్చలవల్లనూ గాక, పల్లెటూళ్ళకు వెళ్ళడం వల్లనే ప్రత్యక్షంగా అర్థం చేసుకోగలిగాము. రైతు స్థితి గతులను కళ్ళార చూడడంతో మాకు కలిగిన అనుభూతి మరింత దృఢపడింది. తరువాత మాఅభిప్రాయాలు మారినా, అప్పుడు మేము మావెనుకటి జీవనవిధానాన్ని, ప్రమాణాలను పూర్తిగా విడిచివేశాము.

చిరకాలంగా నిరీక్షించిన స్వాతంత్ర్యం మనకు ఎక్కువ హింసాకాండ లేకుండానే సిద్ధించింది. కాని స్వాతంత్ర్యం ప్రాప్తించిన వెనువెంటనే దేశమంతటా కారు చీకట్లు కమ్ముకున్నవి. ఉద్రేకంతో ప్రజలు ఉన్మత్తులయ్యారు. మనస్సులు భయద్వేషాలతో కలుషితం కావడంతో వారికి యుక్తాయుక్తవిచక్షణ జ్ఞానం నశించింది. భయంకరమైన సంఘటనలు జరిగాయి. మానవులలోని పశుత్వం మనల్ని దిగ్భ్రాంతుల్ని చేసింది. అంతటా అంధకారమే అలుముకున్నది. ఐతే ఈ కారు చీకట్లనడుమ ఒక దీపకళిక నిశ్చలంగా నిలిచి వెలిగింది. ఆ దీపపుకాంతిని చూడడం చేతనే మనకు తిరిగి ఆశ, శక్తి చేకూరాయి.

తాత్కాలికంగా ప్రజలు ద్వేషోన్మత్తులై ఎంతటి అకృత్యా లకు తలపడినా, ఈ హింసాకాండకు అతీతమై నిలిచిన ఆ దీపకళికయే భారతీయ సంప్రదాయ వైశిష్ట్యానికి చిహ్న మనే ఓదార్పు మనకు కలిగింది. ఆ క్లిష్టకాలంలో గాంధీ మహాత్ముని ఉనికి మనదేశాని కెంతటి మేలు కలిగించిందో మీలో ఎందరు గుర్తించారు? గతించిన అర్ధశతాబ్దంలో ఆయన భారతదేశానికి, స్వాతంత్ర్యోద్యమానికి ఎంతటి మహత్తరమైన సేవచేశాడో అందరికీ తెలుసు. కాని భయంకర హింసాకాండతో దేశంలోని వాతావరణం కలుషితమైన ఆ రోజులలో ఆయన ఈ కలహాలకు, ద్వేషా నికి అతీతంగా నిలిచి, సత్య ధర్మపథానికి దారిచూపే దీప స్తంభంవలె ప్రకాశించడం ఆయన మనదేశానికి చేసిన సేవ లన్నిటిలోనూ అతిముఖ్యమైనది. మృదుగంభీరకంఠంతో అప్పు డాయన మనల్ని హెచ్చరించి, సరియైన దారి చూపాడు.

అనేక వస్తువుల ఉత్పత్తినిగురించి మనం మాట్లా డుతూ వుంటాము. అయితే నిజాయితీ, మంచితనం వున్న మనుష్యుల్ని ఉత్పత్తి చేయడమే ఏ దేశానికైనా అన్నిటి కంటె ముఖ్యమేమో! ఈ దేశంలో అటువంటి సత్పురు షుడు కొన్నాళ్ళ కిందట జీవించాడు. ఆయన సౌమ్యత, నీతి, ఆత్మశక్తి దేశానికి కొత్తవెలుగును ప్రసాదించాయి. ఆయన కాంతి మనమీద కూడా ప్రసరించింది. కించిజ్జ్ఞుల

మైన మనం తప్పుదారి పట్టినప్పుడు ఆయనే వారిస్తున్నాడు. మనం ఋజుమార్గంనుంచి దారితప్పి మన సత్సంప్రదాయాలకు, సత్కీర్తికి భంగం కలిగేటట్లు ప్రవర్తించాం. ఇక మనమీ అవిధేయతను మానుకోవాలి. నిర్మాణాత్మక పథంలో సోదర మానవులపట్ల సౌహార్ద సహకార భావాలు ప్రదర్శిస్తూ పురోగమించాలి.

అర్ధ శతాబ్దానికి పైబడి గాంధీమహాత్ముడు మన సువిశాల దేశంలో ఉత్తరాన హిమాలయాలు మొదలుకొని దక్షిణాన కన్యాకుమారి వరకు అన్ని ప్రాంతాలను సందర్శించాడు. దేశంలో నలుమూలలను ఆయన చూశాడు అంతే వినోదానికి కాదు, విలాసయాత్రికునివలె కాదు. ప్రజలను కలుసుకుని, వారి కష్టసుఖాలు తెలుసుకుని వారికి సేవచెయ్యడం కోసం ఆయన పర్యటించాడు. ఆయన పర్యటించినంత ఎక్కువగా మనదేశంలో పర్యటించి, ప్రజల బాగోగులను అర్థం చేసుకుని, అంత అధికంగా వారికి సేవ చేసిన భారతీయులు మరెవ్వరూ లేరేమో.

యావజ్జీవితం ఆయన మన దేశాన్ని గురించి యోచించినప్పుడు ముఖ్యంగా దీనులను, దరిద్రులను, దుఃఖజీవులను గురించి బాధపడేవాడు. వారిని ఉద్ధరించడమే, వారికి స్వేచ్ఛను ప్రసాదించడమే తన జీవిత లక్ష్యంగా ఎంచుకున్నాడు. దేశంలో ఎవరూ నిస్పృహతో తమ్ముతాము అధఃకరించుకోకుండా ఆయన కూడా వారి జీవిత

విధానాన్నే, వారి దృష్టులనే స్వీకరించాడు. ప్రజల హృదయాలలో స్వాతంత్ర్యోదయమే విజయమని ఆయన విశ్వాసం.

ఏవిధమైన ఘనవిజయం మనం సాధించాలని గాంధీజీ వాంఛించాడు? హింసతో, వంచనతో, కుతంత్రాలతో అనేక వ్యక్తులు, దేశాలు సాధించే విజయం ఆయన కోరలేదు. అది చిరకాలం నిలిచే విజయం కాదు. సత్యాన్ని పునాదిగా చేసుకుని నిర్మించిన విజయసౌధమే కలకాలం నిలిచి వుంటుంది. గాంధీజీ మనకు నూతన రాజకీయతంత్రం నేర్పాడు. రాజకీయ సమరంలో నూతనాస్త్రాలను ప్రసాదించాడు. రాజకీయరంగంలో కూడా సత్యానికీ, సౌహార్దానికీ, అహింసకూ ఎంత శక్తి ఉంటుందో ఆయన నిరూపించాడు. ఎదుటివారి మతంతోనూ, రాజకీయవిశ్వాసాలతోనూ నిమిత్తం లేకుండా ప్రతి భారతీయుడిని తోటి మానవుడిగా, పౌరునిగా గౌరవించి సహకరించడం మనకు నేర్పాడు. అందరం భారతమాత బిడ్డలమే. ఈ దేశంలో జీవించి, ఇక్కడే మరణించవలసినవారమే. మనం గడించిన స్వాతంత్ర్యంలో అందరం సమాన భాగస్వాములమే. స్వతంత్ర భారతదేశం ప్రసాదించే అవకాశాలపై, సంపదపై నలభై కోట్ల భారతీయులకు సమంగా హక్కుండాలి. గాంధీజీ కొద్దిమంది అదృష్టవంతుల కోసమే కష్టించి పని చేసి, చివరకు ఆత్మాహుతి చెయ్యలేదు. ఆయన ప్రజలందరి

మేలుకోసం కృషి చేశాడు. మనం కూడా ఆ విధంగానే ఆ లక్ష్యంకోసమే పాటుపడాలి.

ఆయన స్మృతిచిహ్నంగా కంచువిగ్రహాలనో, పాల రాతి విగ్రహాలనో ప్రతిష్ఠించాలని, స్తంభాలను నిలపాలని ప్రజలు చేసే సూచనలను చూస్తే, ఆయన సందేశం వారికి స్పష్టంగా అర్థం కాలేదనిపిస్తుంది. ఆయన మెచ్చేటట్లు ఏ విధంగా మన మాయనకు జోహారు లర్పించగలము ? ఎట్లా జీవించాలో, ఎట్లా మరణించాలో ఆయన మనకు చూపాడు. ఆ పాఠం మనం నేర్చుకోలేకపోతే, ఆయనకు స్మృతిచిహ్నాలను నెలకొల్పడంవల్ల ప్రయోజన మేమీ వుండదు. యావజ్జీవితం ఆయన అడుగుజాడలలోనే మనం కూడా నడుస్తూ, కర్తవ్యపాలనలోనే తనువు చాలించడమే మనం ఆయనకు నెలకొల్పగల ఉత్తమ స్మృతిచిహ్నం.

ఆయన హిందూమతస్థుడై, భారతీయుడై జన్మిం చాడు. ఎన్నో తరాలగా అంతటి మహనీయుడు మరొకడు మనదేశంలో ఆవిర్భవించలేదు. తాను హిందువై, భార తీయుడై పుట్టినందు కాయన గర్వించాడు. చిరకాలంగా స్థిరంగా నిలిచిన పరమ సత్యాలకు ప్రాతినిధ్యం వహించిన దని భారతదేశమంటే ఆయన కంతటి అభిమానం. ఆయన జీవితంలో మతానికి చాలా ప్రాముఖ్య మున్నది. ఈ దేశా నికి స్వాతంత్ర్యం గడించిన మహనీయుడు గనుక ఆయనకు జాతిజనకుడనే పేరు వచ్చింది. అయినా మతంకాని,

జాతీయత కాని ఆయన దృష్టిని ఏ మాత్రం సంకుచితం చెయ్యలేదు. అందుచేతనే ఆయన అన్ని మతాల గమ్యమూ ఒక్కటేనని, వారి అవసరాలనుబట్టి చూసినా యావన్మానవులూ ఒకజాతివారేనని గుర్తించి, ప్రపంచంలో అంతటా చెదిరివున్న దరిద్రనారాయణుల సేవనే తనకు లక్ష్యంగా చేసుకున్నాడు.

ఆయన మనుష్యుల మనస్సులపై, హృదయాలపై ఇంతటి మహత్తర ప్రభావాన్ని ప్రసరించడానికి కారణ మేమిటి? ముందుతరాలవారే ఈ ప్రశ్నకు సమాధానం చెప్పగలరు. మనం ఆయనకు సన్నిహితులం కావడంచేత ఆయన బహుముఖ వ్యక్తిత్వానికి వెలకట్టి విలువలు నిర్ణయించలేము. అయినా మనం కూడా ఆయన జీవితంలో ముఖ్యంగా సత్యాన్ని ఆరాధించాడన్న సంగతి గుర్తించాము. ఉత్తమ లక్ష్యాలను వక్రమార్గాల ద్వారా సాధించడం సాధ్యం కాదనీ, మార్గం వక్రమైనదైతే గమ్యం కూడా కలుషితం కాకతప్పదనీ ఆయన పదేపదే హెచ్చరించడానికి సత్యనిష్ఠయే కారణం. సత్యప్రియత్వంచేతనే ఆయన తాను తప్పుచేసినట్లు భావించినప్పుడల్లా బహిరంగంగా ఆ సంగతి ఒప్పుకునేవాడు. "హిమాలయాల వంటి పెద్ద తప్పులు" చేసినట్లు ఆయన చెప్పుకున్నాడు. సత్యదీక్షవల్లనే ఎక్కడ అసత్యం, దుర్మార్గం కనిపించినా, పర్యవసానం ఏమవుతుందని లెక్కచెయ్యకుండా ఆయన

ప్రతిఘటించాడు. ఎక్కడ ప్రజలలో అసమత్వం, తారతమ్యం, అధికారుల దౌర్జన్యం ఉంటాయో, అక్కడ అన్యాయం, దుర్మార్గం, అసత్యం ఉంటాయి. అందుచేతనే ఆయన ఈ బాధలకు గురియవుతున్న పేదసాదలకు సేవ చెయ్యడం తన ముఖ్యకర్తవ్యంగా భావించాడు. రాజకీయంగా, సాంఘికంగా పీడల పాలవుతున్న దళితజనానికి ప్రియతమనాయకుడై మానవజాతికే ఉత్తమ ప్రతినిధిగా భాసించాడు.

ఆయన భారతీయులలో ఐకమత్యం పెంపొందించిన మహనీయుడు. ఎదుటివారిని ఏదోవిధంగా భరించి ఊరుకోవడం కాక, వారు కూడా మనతో సమంగా అభ్యసిద్ధికై కృషిచేస్తున్న మిత్రులు, సహచరులు అని భావించాలని ఆయన బోధించాడు. మన సంకుచిత దృష్టిని తొలగించుకుని ఎదుటివారిలోని మంచితనం గ్రహించేటట్లు చేశాడు. ఆయన జీవితంలోని తుదినెలలు, చివరకు ఆయన హాత్మాన్మరణమున్నూ, ఈ ఔదార్యాన్నే, విశాల దృక్పథాన్నే, ఐకమత్య భావాన్నే మనకు బోధించాయి. ఆయన మరణానికి కొంచెం ముందు మనం ఈ విధంగా ఉదారంగా ప్రవర్తిస్తామని ఆయనకు వాగ్దానం చేశాము. ఈ వాగ్దానాన్ని మనం నిలబెట్టుకోవాలి. ఏ మతానికి చెందినవారైనా, ఈ దేశంలో వసించేవారందరూ భారతీయులని, ఇదే వారి నివాసభూమి అని మనం గుర్తుంచుకోవాలి.

ప్రశస్తమైన మన వారసత్వంలో వారికి కూడా వాటా వుంది. వారికీ మనతో సమానంగా హక్కులూ, బాధ్యతలూ వున్నవి. ప్రపంచంలోని విశిష్ట సమాజాలన్నిటివలెనే మనదికూడా విభిన్న జాతులతో ఏర్పడిన సమాజం. ఈ విశిష్టతను గుర్తించక సంకుచిత దృష్టిని అలవరచుకుంటే, ఆయన తుది సందేశాన్ని మనం ధిక్కరించినట్లవుతుంది. అతి కఠిన ప్రయాసతో ఆయన సాధించిన స్వాతంత్ర్యాన్ని మనం కోల్పోయే ప్రమాద మేర్పడుతుంది.

గడిచిన పాతిక సంవత్సరాలలో గాంధీమహాత్ముడు భారతదేశ స్వాతంత్ర్యానికేగాక ప్రపంచశాంతికే ఎంతో బలం చేకూర్చాడు. ఆయన మనకు అహింసా సిద్ధాంతాన్ని బోధించాడు. అహింస అంటే దుష్టశక్తులను ప్రతిఘటించకుండా లొంగిపోవడం కాదు. అంతర్జాతీయ విభేదాలను శాంతియుతంగా పరిష్కరించుకోవడానికి నిశ్చయంగా ఉపయోగపడే ఉత్తమ సాధనంగా ఆయన అహింసా సిద్ధాంతాన్ని రూపొందించాడు. మారణాస్త్రాలకంటె మానవుని ఆత్మశక్తి అధిక శక్తివంతమైనదని ఆయన నిరూపించాడు. రాజకీయ కార్యాచరణను నైతిక ప్రమాణాలతో జతచేసి, ఆయన, లక్ష్యంతో సాధనాన్ని విడదీయడానికి వీలులేదనీ, సాధనాన్ని బట్టే లక్ష్యంకూడా ఉంటుందనీ సూచించాడు. వక్ర మార్గంతో సాధించగోరే లక్ష్యంకూడా కొంతవరకు కుటిలం, కలుషితం కాకతప్పదు. అన్యాయం పైన ఆధార

పడిన ఏ సమాజమైనా, ఆ దోషాన్ని పూర్తిగా తొలగించుకోవాలి. లేకపోతే దాని పతనానికి దారితీసే శక్తులు ఆ సమాజంలోనే నిక్షిప్తమైవుంటాయి.

పరిమితమైన పరిధిలో ఆలోచించడానికి అలవాటుపడ్డ ఆధునికులకు ఇదంతా ఆచరణ సాధ్యంకాని ఆదర్శవాదంగా కనిపించవచ్చు. కాని ఇతరమార్గాలు మాటి మాటికీ విఫలం కావడం మనం కళ్ళార చూశాము. ఇన్నిసార్లు విఫలమైన మార్గమే ఆచరణయోగ్యమని ఎవరనగలరు? మానవుల దౌర్బల్యాలను, రాజకీయవేత్త లెదుర్కొనే ప్రమాదాలను మనం మరచిపోవడానికి వీలులేని మాట నిజమే. ప్రపంచంలో ఇప్పుడున్న పరిస్థితులలో ఇక యుద్ధమంటూ రాబోదని కూడా చెప్పలేము. అయితే జాతీయ సంబంధాలలోనూ, అంతర్జాతీయ సంబంధాలలోనూ మనం నైతిక సూత్రాల ప్రామాణ్యాన్ని గుర్తించనంతవరకు శాంతి సుస్థిరంగా నెలకొలదని నేను గ్రహించాను. సాధనం సరళమైనది కానంతవరకు సాధించే లక్ష్యం కూడా సరియైనది కాజాలదు. గాంధీజీ ఉపదేశ సారమిదే. మానవాళికి సమ్యగ్దృష్టి లభించి ఋజుమార్గంలోకి పురోగమించాలంటే ఈ సత్యాన్ని గుర్తించక తప్పదు. క్రోధంతో ఎరుపెక్కిన కళ్ళకు చూపు సరిగా కనిపించదు.

మనం ఎన్నో తప్పులు చేశాం. వీటిలో కొన్ని మనకు తెలిసినవే. అయితే పాతికేళ్ళకుపైగా స్వాతంత్ర్యో

సమరంలో మనకు నాయకుడై దారి చూపిన జాతిపిత గాంధీజీ ఏర్పరచిన ఉన్నతప్రమాణాలనుంచి ఆచరణలో దిగజారిపోవడమే మన లోపాలన్నిటిలోనూ ముఖ్యమైనది.

భయమే హింసాద్వేషాలకు కారణమనీ, భయాన్ని విడిచి వెయ్యాలనీ ఆయన మనకు బోధించాడు. మనలో చాలామంది ఈ బోధను మరచి పోయారు. భయానికి దాసులయ్యారు. ఏదో దూర శత్రువును గురించిన భయం కాదు. తోటి ప్రజలనుగురించే అనుమానం, భయం పెంచుకున్నారు. ఆ భయమే ఎన్నో క్రూరకృత్యాలకు దారి తీసింది.

మనకు సరియైన దారిచూపి, ఉత్సాహం కలిగించిన నాయకుడు ఈనాడు లేడు. ఇక భారాన్ని మనమే మోయవలసివుంది. కనుక మనం ముఖ్యంగా ఆయన అడుగుజాడలలోనే నడుస్తూవున్నామా ? లేక దారి తప్పి అన్యమార్గాల ననుసరిస్తూన్నామా అని ఆత్మ పరీక్ష చేసుకోవాలి.

ఏనాటికైనా భారతదేశం సుసంపన్నమై గౌరవ ప్రతిష్ఠలను పొందాలంటే, అందుకు ఏకైకమార్గం గాంధీజీ సందేశాన్ని శ్రద్ధగా పాటించడమేనని నా దృఢవిశ్వాసం. భారతదేశసేవకే నేను దీక్షపూనినప్పటికీ, అప్పుడప్పుడు కర్తవ్యపాలనలో తప్పులు చేశానని నాకు తెలుసు. అయితే

మనలో ఎన్ని లోపాలున్నా, మన ప్రియతమనాయకుడు మనకు ప్రసాదించిన శక్తికూడా ఇంకా మనలో వున్నది. ఆయన సందేశంకూడా మనకు శక్తి కలిగిస్తున్నది. ఆయన మనకు నేర్పిన పాఠాలను, మన ఎదుట నిలిపిన మహోన్నతాదర్శాలను మనం జ్ఞప్తిచేసుకుందాం. ఆ పాఠాలను, ఆదర్శాలను మనం మరచిపోతే మన ఆశయాలకూ, దేశానికీ నష్టం కలుగుతుంది.

వ్యక్తిగత జీవితంలోనేగాక రాజకీయవ్యవహారాలలోనూ, అంతర్జాతీయ సంబంధాలలోనూ సత్యనిష్ఠను, ఋజువర్తనను పాటించాలని ఆయన మనకు బోధించాడు. మనిషి ఘనతను, మనిషిచేసే కృషిఘనతను ఆయన వెల్లడించాడు. హింసాద్వేషాలవల్ల హింసాద్వేషాలే, వినాశమే సంభవిస్తాయనే ప్రాచీన బోధను ఆయన పునరుద్ఘాటించాడు. అందుకే మనం అభయాన్ని, ఐకమత్యాన్ని, సహనాన్ని, శాంతిని పెంపొందించుకోవాలని ఆయన మనకు బోధించాడు.

ఈ ఉపదేశాన్ని మనం ఎంతవరకు పాటించాం? ఎక్కువగా పాటించలేదనే చెప్పాలి. ఆయన బోధ కొంత వరకు మనం గ్రహించగలిగాము. ఆయన నాయకత్వాన శాంతియుత పద్ధతులలోనే స్వరాజ్యం సంపాదించగలిగాము. కాని దురదృష్టంకొద్దీ స్వాతంత్ర్యోదయ సమయంలోనే

మనం ఆయన నేర్పిన గుణపాఠాలను నిస్మరించి, వక్రమార్గాల ననుసరించి, భారతదేశంకోసం, భారతదేశం యుగయుగాలుగా చాటిన మహత్తరసత్యాలకోసం అంతగా తపించిన ఆ మహనీయుని హృదయానికి చాలా బాధ కలిగించాం.

ఈనాటి పరిస్థితి ఏ విధంగావుంది? ఆయనను మనం స్మరిస్తూ, ప్రశంసిస్తూ, ఆయన స్మృతిచిహ్నంగా విగ్రహాలను ప్రతిష్ఠించాలని అవ్యక్త సూచనలు చేస్తూవున్నప్పుడు ఆయన ఏ మహత్తర సందేశంకోసం జీవితమంతా ధార పోసి చివరకు ప్రాణాలనుకూడా అర్పించాడో మనం ఆలోచిస్తున్నామా? ఆ సందేశాన్ని మనం ఇంకా పాటించలేకపోతున్నామనే నా విచారం. అయితే ఆయన సంకల్ప బలంవల్ల భారతదేశాన్ని ఆయన చూపిన బాటలోనే నడిపే శక్తులు కనిపించకుండానే పనిచేస్తూవున్నాయని నా నమ్మకం. అయితే వీటికి వ్యతిరేకంగా అసత్యాన్ని, హింసను, సంకుచితతత్వాన్ని, విచ్ఛిత్తిని రెచ్చగొట్టే దుష్టశక్తులు కూడా పనిచేస్తున్నవి. మంచికీ, చెడుగుకూ మధ్య ప్రపంచంలో ఎప్పుడూ సంఘర్షణ ఉంటుంది. మనం నిజంగా గాంధీజీకి శ్రద్ధాంజలి ఘటించాలనుకుంటే, ఆయనకు ప్రియమైన ఉద్యమాల సాఫల్యంకోసం నిర్విరామంగా కృషి చెయ్యాలి.

భారతదేశాన్ని నేను ప్రేమించడానికి, ఈ దేశ సేవకు నే నుద్యమించడానికి కారణం కేవలం యిది సువిశాలమైన

భూభాగమని కాదు, దీని గతచరిత్ర మహోజ్జ్వలమైనదనీ కాదు. వర్తమాన భారతదేశంపై నాకుగల విశ్వాసం ఈ దేశం సత్యానికీ, స్వాతంత్ర్యానికీ, ఉన్నత లక్ష్యాలకూ నిలయమై నిలిచివుంటుందనే నమ్మిక, ఇవే నా దేశభక్తికి కారణాలు.

గాంధీజీ మన యెదుట నిలిపిన ఈ ఆశయాలకు, ఆదర్శాలకు భారతదేశం ప్రాతినిధ్యం వహించాలని మీరు కోరుతున్నారా? అయితే క్షణికలాభాలను, తాత్కాలిక కోర్కెలను విడిచిపెట్టి ఆయన బోధను గ్రహించి తదనుగుణంగా ప్రవర్తించాలి. కులతత్త్వం, పరమతద్వేషం, ప్రాంతీయాభిమానం వంటి సంకుచిత తత్త్వాలను నిర్మూలించాలి.

భారతదేశం ఇతరదేశాలపై దండెత్తగోరితే, భారత ప్రభుత్వంలో నాకు, నా సహచరులలో చాలామందికీ చోటుండబోదు. దురాక్రమణ విధానాన్ని మనం అవలంబిస్తే, గాంధీజీ బోధకు, ఇంతకాలంగా జీవితంలో మనం పాటించిన ఉన్నతాదర్శాలకు ద్రోహంచేసినట్లవుతుంది.

ఇతర దేశాలలో ఏమైనా జరుగనివ్వండి. మనం మాత్రం తొందరపడక గాంధీజీ బోధనే అనుసరిస్తూ ప్రశాంతంగా వుందాం. ఆయన దారినే మనం విశ్వాసంతో అనుసరిస్తే, అందువల్ల దేశంపట్ల మనం విశ్వాసం చూపినట్లవు

తుంది. మనకు మేలు జరుగుతుంది. మనకు అత్యంత ప్రియ మైన మనదేశానికీ క్షేమలాభాలు సమకూరగలవు.

భవిష్యత్తును గురించి నాకు భయమేమీలేదు. సైనిక బలం దృష్ట్యా భారతదేశానికి చెప్పుకోదగినంత సాధన సామాగ్రి లేకపోయినా, అందుకు నేను భయపడడం లేదు. అగ్రరాజ్యాల విస్తృతికీ, వాటి సైన్యాలకూ, నౌకాదళా లకూ, అణ్వస్త్రాలకూ నేను జంకను. నా దేశికుడు నాకు బోధించిన పాఠమిది. నిరాయుధులమై మేమొక దేశాన్ని, ఒక సామ్రాజ్యాన్ని ప్రతిఘటించాము. ఆ రోజులలో మేము దుర్మార్గానికి లొంగకూడదని నిశ్చయించుకున్నాము. ఆ నిశ్చయమే మాకు ధైర్యసాహసాలను చేకూర్చింది. ఈ నాటికీ మనం ఆ నిశ్చయాన్నే అనుసరించడం శ్రేయస్కర మని నా నమ్మకం. భయాన్ని మనం విడనాడగలిగితే, ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకోగలిగితే, ఇతరులవలె వాక్పారుష్యానికీ, దౌర్జన్యకాండకూ, చివరకు యుద్ధా నికీ సంసిద్ధం కాకుండా సౌహార్దంతో, నమ్మికతో మనం రాజ్యతంత్రాన్ని నెరపగలుగుతామనుకుంటాను.

ఆయన ఆదర్శాలను గురించి మనం ఆయన జీవిత కాలంలో కంటె ఎక్కువగా ఆయన మరణానంతరం గాఢంగా ఆలోచించవలసివచ్చింది. ఆయన ముఖ్యంగా ఏ ఆదర్శాలకోసం జీవించాడో, వాటిని మనం అర్థంచేసు

కుని ఆచరించనంతకాలం మనకృషి ఫలించదని. అట్లా ఆచరించిననాడే మనకు విజయం సిద్ధిస్తుందని నా విశ్వాసం.

అనేక కారణాలవల్ల ఈ నాడు ప్రపంచంలో భారత దేశం ప్రసిద్ధి పొందింది. వీటిలో ముఖ్యకారణం గాంధీ మహాత్ముడు. ఆయనవల్లనే భారతదేశానికి సమున్నత స్థానం లభించింది. మన సైన్యాన్ని, నౌకాదళాన్ని, సంపదను చూసి కాదు, ఈ మహనీయుడు మనమధ్య జన్మించి ప్రపంచం నైతికంగా ఎంత అధోగతిలో ఉన్నదో, రాజకీయ వేత్తలు ఎంత తక్కువ స్థాయిలో ఉన్నారో చూపడంచేత అందరూ మనదేశాన్ని గౌరవిస్తున్నారు. నైతికంగా భారతదేశానికి విశిష్టత ఉన్నదని వారు భావిస్తున్నారు. మనలో అనేకులు క్షుద్రజీవులైనా, గాంధీజీ అడుగుజాడలలో నడవడానికికూడ అనర్హులైనా, ఈదేశం అంతటి మహనీయుణ్ణి సృష్టించింది గనుక ఇది ప్రపంచప్రజల మన్ననకు పాత్రం కావడం సముచితమే.

హింసవల్ల, ద్వేషంవల్ల, అసహనభావంవల్ల ఏ జాతిగాని స్వతంత్రమై పురోగమించబోదని ఆయన మనకు బోధించాడు. ఆయన నాయకత్వాన నడువడంచేతనే మనం శాంతియుతంగా స్వాతంత్ర్యాన్ని పొందగలిగాము. ప్రపంచం హింసాభయద్వేషావృతమైన విషవలయంలో చిక్కుకున్నది. అన్యమార్గాన్ని అనుసరిస్తేనేకాని అది ఆ విషవలయాన్ని భేదించి బయటపడలేదు. అందుచేత మనం

ఋజుమార్గమే ఉత్తమగమ్యానికి చేర్చగలదనే దృఢవిశ్వాసంతో ఆ మార్గాన్నే అనుసరిద్దాం. ఆ విధంగా మనం ప్రపంచంలో ఈ నాడు భిన్నజాతులమధ్య ముఖ్యంగా కావలసిన సామరస్య సిద్ధికి తోడ్పడగలం.

నేనూ, నా ప్రభుత్వమూ క్లిష్ట సమస్య నొకదానిని ఎప్పుడూ ఎదుర్కొనవలసి వస్తున్నది. రాజకీయంగా మేము గాంధీసూత్రపు నీడలో పుట్టిపెరిగాము. అహింసకు, ఆర్థిక విధానాలకు సంబంధించినంతవరకు మేము గాంధీజీ సిద్ధాంతాలను పూర్తిగా స్వీకరించలేదు. ఐనా, నూటికి నూరుపాళ్ళు కాకపోయినా, చాలావరకు మేము ఆయన సిద్ధాంతాలను భారతదేశ పరిస్థితులకు - బహుశా కొంత వరకు ప్రపంచపరిస్థితులకుకూడా - అనుగుణమైనవని భావించి స్వీకరించాము. సాయుధబల సంపత్తితోకూడిన ప్రభుత్వాన్ని ప్రతిఘటిస్తూ శాంతియుత పద్ధతులతో స్వాతంత్ర్యసిద్ధికై పోరాడిన మేము ఈనాడు దేశంలో శాంతి భద్రతల రక్షణకోసం బలప్రయోగానికి సిద్ధపడవలసి వచ్చినపుడు మా మానసికస్థితి ఎట్లా ఉంటుందో మీరే ఊహించండి. బలప్రయోగం మాకు సంతోష దాయకం కాదు. ప్రభుత్వప్రధాన దేశంలో శాంతిభద్రతలకు భంగం వాటిల్లకుండా చూడవలసిన బాధ్యత మామీద ఉన్నది. మేము శాంతిభద్రతలను రక్షించకపోతే దేశమే విచ్ఛిన్నమై పోయే ప్రమాదమేర్పడెంది. మా బాధ్యతను మేము విస్మ

రించడానికిగాని, అన్యథా ప్రవర్తించడానికిగాని వీలులేని పరిస్థితి అది. అయితే గాంధీజీ బోధించిన అహింసాసిద్ధాంతాన్ని గురించి ఒకవంక మాట్లాడుతూ, మరొకవంక బలప్రయోగానికి సమ్మతించడం అసమంజసమనే శంకా, సంకోచం మాకు లేకపోలేదు. గాంధీజీని గురించి మాట్లాడుతూనే వున్నాం. అడుగడుగున ఆయన సిద్ధాంతాలకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తూనే వున్నాం. ఈ సంగతి తలుచుకుంటే బాధగానే వుంటుంది. కాని దేశంలో ఉన్న పరిస్థితులనుబట్టి మేము ప్రవర్తించవలసివచ్చింది. మరొకవిధంగా మేము ప్రవర్తిస్తే బాగుండేదేమో నాకు తెలియదు. మా బుద్ధిననుసరించి మేము వర్తించాము. అయితే ఏనాడూ గాంధీజీ సిద్ధాంతాల విశిష్టతను, ప్రమాణాన్ని మేము అధఃకరించలేదు. కాని తప్పనిసరిగా మేము పరిస్థితుల కనుగుణంగా మా విధిని నిర్వహించవలసివచ్చింది.

అధికారులను ప్రతిఘటిస్తూ, విప్లవాత్మక చర్యల లోనే మా జీవితాలను గడిపాము. విప్లవ వాతావరణం లోనే పెరిగాము. కాని ఈనాడు మేము అధికారాన్ని చేపట్టి కఠిన సమస్యలను ఎదుర్కొనవలసి వస్తున్నది. ప్రభుత్వాన్ని ఎదిరించడమే అలవాటైన మాకు ఈనాడు స్వయంగా ప్రభుత్వాన్ని నిర్వహించవలసి రావడం సులభమైన పనికాదు. మానసికంగా ఈ పరిణామానికి అలవాటు కావడం ఎవరికైనా, ఎన్నడైనా సునాయాసం కాదు.

పైగా మేము కేవలం విదేశపరిపాలనను ధిక్కరిస్తూ, సమాజాన్ని కల్లోలితం చేస్తూ, స్వాతంత్ర్యసమరం సాగించిన విప్లవవాదులం మాత్రమే కాదు. గాంధీమహాత్ముడు నెలకొల్పిన ఉన్నత సంప్రదాయాలను పాటిస్తూ మేము మా పోరాటాన్ని సాగించాము. ఆయన నెలకొల్పినది ధార్మిక నైతిక సంప్రదాయం. ఆ నైతికప్రమాణాలనే ఆయన దైనందిన రాజకీయ వ్యవహారాలకు కూడా వర్తింపజేశాడు. రాజకీయ సంఘర్షణను, స్వాతంత్ర్య యుద్ధాన్ని ధార్మిక నైతిక సూత్రాల ననుసరిస్తూ కొనసాగించే అపూర్వ కార్యాచరణ పద్ధతిని ఆయన మాకు నేర్పాడు. మాలో ఎవ్వరైనా ఆ నైతిక సూత్రాలను పూర్తిగా పాటించి కృతకృత్యులయ్యారని చెప్పే సాహసం నాకు లేదు. కాని గడిచిన ముప్పై ఏళ్ళలోనూ మనదేశంలో అందరమూ కొద్దిగానో, గొప్పగానో ఆ మహనీయుడు ప్రబోధించిన ధార్మిక నైతిక సూత్రాల ప్రభావానికి లోనయ్యామని మాత్రం నిస్సంకోచంగా చెప్పగలను.

ఈ నైతిక సంప్రదాయాలను, ఉన్నతాదర్శాలను దృష్టిలో ఉంచుకుంటూనే ఈనాడు క్లిష్టసమస్యల నెదుర్కొనవలసి వస్తున్నది. ఆ నైతికసూత్రాన్ని ఈ సమస్యల పరిష్కారానికి వర్తింపజేయడం అసాధ్య మవుతున్నది. ఆదర్శాలకూ, ఆచరణకూ మధ్య ఈ సంఘర్షణను వ్యక్తులేమి, సంఘాలేమి, జాతులేమి తరుచుగా ఎదుర్కొనవలసి

వస్తూనే వుంది. అయితే అసాధారణ పరిస్థితులలో మాలో ఈ సంఘర్షణ చెలరేగింది. ఆ పరిస్థితులు సంఘర్షణను ప్రబలం చేశాయి. అందుచేతనే మాలో ఈ భావమథనం తప్పనిసరి అయింది. గాంధీజీని, ఆయన మహత్తర సందేశాన్ని, ఉత్తమబోధను తరుచుగా ప్రశంసిస్తూనే వున్నాం. కాని నిజంగా వాటిని గురించి గాఢంగా యోచించలేదు. అందుచేతనే "ఆయన సందేశాన్ని గురించి ప్రశంసా వాక్యాలు పలుకుతూ, దానిని ఆచరణలో పెట్టలేకపోవడం ఆత్మవంచన, పరవంచన కాదా?" అనే సందేహం మాలో ఉత్పన్నమయింది. ఎందుచేతనంటే మేము వంచకులమైతే, మా భవిష్యత్తు అంధకారావృత మవుతుంది. జీవితంలో క్షుద్రవిషయాలలో వంచనవల్ల ఎక్కువ హాని లేకపోవచ్చు. కాని ప్రధానవిషయాలలో వంచన ప్రమాదకరం. నిజంగానే ఆ నాయకోత్తముని గౌరవప్రతిష్ఠలను స్వేచ్ఛగా ఒకవంక ఉపయోగించుకుంటూ, ఆయన మనకూ, ప్రపంచానికీ ప్రసాదించిన సందేశాన్ని మాత్రం అంతరంగంలోనూ, ఆచరణలోనూ పాటించకపోతే, అంతకంటె దౌర్భాగ్యం మరేదీ వుండదు. అందుకే మాలో ఈ మానసిక సంఘర్షణ కొనసాగుతూ వున్నది. పరిస్థితులకు లొంగి మేము చేసే పనులకూ, ఆదర్శాలకూ మధ్య ఉన్న అంతరాన్ని క్రమంగా తొలగించడం కంటె ఈ సంఘర్షణకు మరొక పరిష్కారమార్గ మేదీ లేదు. పరిస్థితులలో కలిగిన మార్పులతో నిమిత్తంలేకుండా గుడ్డిగా ఆయన చెప్పిన మాటల ప్రకా

రమే మేము కార్యాచరణ కుద్యమించలేము. అట్లు ప్రవర్తించడం ఆయన అభిమతం కాదని నా దృఢవిశ్వాసం. అయితే ఆచరణలో పాటించాలని పలుమారులు మేము శపథంచేసిన ఆ ఆదర్శాలను మాత్రం సదా దృష్టిలో ఉంచుకోవాలి.

ఏ సమస్యనైనా పరిష్కరించడంలో ఒక ప్రవక్తకూ, రాజకీయవేత్తకూ చాలా భేదముంటుంది. గాంధీ మహాత్మునిలో ప్రవక్తా, రాజకీయవేత్తా ఏకమయ్యారు. కాని మనం మాత్రం ప్రవక్తలమూ కాము, చెప్పుకోదగ్గ రాజకీయ వేత్తలమూ కాము. కనుక మనం చెయ్యగలిగినదల్లా ఆయన మన యెదుట నిలిపిన ఉన్నత ప్రమాణాన్ని పాటిస్తూనే, ప్రతిసమస్యను గురించి శ్రద్ధగా చర్చించి మనబుద్ధికి మంచిదని తోచినట్లు పరిష్కరించడమే. లేకపోతే అపకారమే జరుగుతుంది. ప్రవక్త సందేశాన్ని నిరాకరించడమూ తప్పే. అనాలోచితంగా దానిని పాటిస్తూ ఆంతర్యాన్ని మాత్రం అర్థంచేసుకోలేక పోవడమూ తప్పే. అందుచేత మనకు మధ్యేమార్గమే శరణ్యం.

ఆత్మరక్షణ ప్రతిదేశానికీ ప్రథమకర్తవ్యం. దురదృష్టవశాత్తు ఆత్మరక్షణకు సైనికబలం కావాలి. అందుచేత అవసరాన్నిబట్టి రక్షణదళాలనూ, ఆయుధ సామగ్రినీ సమకూర్చుకోవలసి వస్తుంది. అట్లా సైనికబలాన్ని మనం సమకూర్చుకోకుండ ఉండలేము. గాంధీజీ అయితే ఉండగలిగే

వాడే. అది తప్పని అనే సాహసం నాకు లేదు. నిశ్చయంగా ఏదేశానికైనా అట్లా సైనికబలం లేకుండానే ఉండగలశక్తి సమకూరితే, ఆ దేశం స్థిరంగా నిలిచి విశిష్టస్థానాన్ని గడిస్తుంది. కాని మేము సామాన్యులం. అంతటి సాహసానికి తెగించలేము.

భారతదేశపు ప్రయోజనాలను సాధించడం నా ప్రథమకర్తవ్యం. అందుకనుగుణంగానే నేను ప్రవర్తించాను. అయితే ఆ కర్తవ్యపాలనలో నేను ప్రపంచపు మేలును కూడా దృష్టిలో ఉంచుకున్నాను. ఆ పాఠమే మనదేశికుడు మనకు బోధించాడు. సదా భారతదేశపు స్వేచ్ఛా గౌరవాలను నిలబెడుతూ, ఇతరులతో శాంతి సఖ్యతలను పెంపొందించుకోవలసినదని ఆయన అన్నాడు. ఈనాడు ప్రపంచంలో నలుమూలల సంఘర్షణలు చెలరేగుతున్నవి. ఘోర ప్రమాదం జరిగే సూచనలు కనిపిస్తున్నవి. ప్రజల హృదయాలలో భయద్వేష సందేహాలు నిండి, వారి దృష్టి మందగించింది. కనుక ప్రపంచంలో ఏర్పడిన ఈ విషమ స్థితిని తప్పించే ప్రతి చర్య అవశ్యం హర్షించదగినదే.

ఏ దేశమైనా, ఏ ప్రభుత్వమైనా ఎప్పుడే ప్రమాదం సంభవిస్తుందోనని ముందుగా జాగ్రత్తపడకుండా ఉండదు. గాంధీజీ బోధను పూర్తిగా ఆచరించగల ధైర్యముంటేనే తప్ప మనం దురదృష్టవశాత్తు దేశరక్షణకై ముందుగా జాగ్రత్త పడకతప్పదు. అంతటిధైర్యమే మనకుంటే

సాహసించి ముందుగా జాగ్రత్తపడకుండా ఉండవచ్చు. అంతటి ధైర్యమే మనకుంటే అదే ఉత్తమ విధానమని నా నమ్మకం. అయితే నేను ధైర్యంగా ఉండడమో, మీరు ధైర్యంగా ఉండడమో కాదు. దేశంలోని ప్రజలందరికీ ఆ విధానాన్ని అర్థంచేసుకుని అనుసరించగల ధైర్యం ఉండాలి. అంతటి ఉన్నతస్థాయిలో గ్రహణశక్తీ, ఆచరణసామర్థ్యమూ మనకు లేవనుకుంటాను. కనుక మనం వ్యర్థంగా గాంధీజీ ప్రసక్తి తీసుకురావద్దు. ఏ ప్రభుత్వమైనా తాను శాంతిని వాంఛిస్తున్నానని చెపుతూ, శాంతిని పరిరక్షించడానికి ఏమీ చెయ్యకుండా కూర్చోదు. ముందుగా మనం జాగ్రత్త పడక తప్పదు. శక్తికొద్దీ హఠాత్తుగా తటస్థించే ప్రమాదాల నెదుర్కొనడానికి సిద్ధంకాక తప్పదు

ఇతర దేశాలనుంచి సహాయాన్ని అర్థించకుండా స్వశక్తిపైననే ఆధారపడి, ఏ ఆయుధాలూ లేకుండా శాంతియుతంగా మేమొక మహాసామ్రాజ్యాన్ని ప్రతిఘటించాము. మా నాయకునిపై, దేశంపై, మాపై మాకు సంపూర్ణ విశ్వాసం ఉండేది. ఆ విశ్వాసమే స్వాతంత్ర్య సమరకాలంలో మాకు బలాన్ని ప్రసాదించి రక్షించింది ఆనాడు, చూడడానికి శక్తిహీనులమైనప్పుడే మా కంతటి ఆత్మవిశ్వాసముంటే, ఈనాడు, స్వతంత్రులమైన తరువాత, ఈ సువిశాల భారతదేశశక్తి రక్షగా ఉండగా మా స్థితి అప్పటికంటె ఎంతో బాగుపడింది. అయినప్పుడు మాలో ఆత్మవిశ్వాస మెందుకు క్షీణించాలి ?

ఆయుధాలు లేకుండా, ఇతర సాధారాలు కూడా ఎక్కువగా ఏమీ లేకుండా మేము భారతదేశ స్వాతంత్ర్య సమరం సాగించిన రోజులను ఒక్క క్షణంపాటు జ్ఞప్తికి తెచ్చుకోండి. అప్పుడు మాకు ఉత్తేజం కలిగించే గొప్ప నాయకుడుండేవాడు. ఇతర నాయకులు కూడా ఉండే వారు కాని, స్వాతంత్ర్యోద్యమపు తాకిడి ఎక్కువగా దేశం లోని జనసామాన్యానికే తగిలింది. వారికి తమదేశంపై, నాయకులపై, తమపై విశ్వాసం ఉండేది. ఈనాడు మనకు అప్పటికంటె అధికబల మున్నది. అందుకే కొందరు ప్రజలు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయి, ఎప్పుడూ నిందలు మోపుతూ నిస్పృహతో నీరసించడం నాకు విస్మయాన్ని కలిగిస్తున్నది.

స్వాతంత్ర్య సమరకాలంలో మనల్ని ముందుకు నడిపిన ఉత్సాహాన్ని, ఆత్మవిశ్వాసాన్ని, ప్రయోజకత్వాన్ని మనం తిరిగి సమకూర్చుకుందాం. మన క్షుద్రకలహాలను, భేదాలను విస్మరించి మనం సాధించవలసిన మహోన్నత లక్ష్యాన్ని మాత్రమే దృష్టిలో నిలుపుకుందాం.

ఈనాడు మనం కొంతవరకు బలహీనులమే. అయితే ఇంతకంటె దుర్బలంగా ఉన్న రోజులలో మాకు మన నాయకోత్తముడు గాంధీజీ ఒక పాఠం నేర్పాడు ఆయుధాలూ, బలాన్ని సూచించే ఐశ్వర్యంవంటి ఇతర సాధనసామగ్రీ ఏమీ లేకుండానే అప్పుడు మనదేశప్రజలు ఈ దేశంలో చాలా

పళ్ళుగా వేళ్ళు పాతుకున్న శక్తిమంతమైన సంపన్న సామ్రాజ్యాన్ని ఎదిరించగలిగారు.

అది చిత్రమైన సంఘర్షణ ముప్పై యేళ్ళ కిందట హఠాత్తుగా గాంధీమహాత్ముడు భారత రాజకీయరంగం మీదికి అడుగుపెట్టిన నాటి చరిత్రను తలచుకుంటున్నాను.[5] అప్పటికే దక్షిణ ఆఫ్రికాలో ఆయన చేసిన కృషిని గురించి విని ఆయనపట్ల ప్రేమాభిమానాలను మేము ప్రకటించాము, కాని భారత రాజకీయాలలో ఆయన ప్రత్యక్షంగా పాల్గొనడం అప్పుడే ప్రారంభమయింది. హఠాత్తుగా ఆయన తన కృషిని ప్రారంభించాడు. ఆయన మాకిచ్చిన సందేశంలో ఏదో అలౌకికశక్తి నిక్షిప్తమైవుంది. ఆ సందేశం చాలా సామాన్యమైనదే. భారతదేశంలో అందరూ, ముఖ్యంగా సామాన్యప్రజలు, విపరీతమైన భయంతో వణికిపోతున్నారని ఆయన కనిపెట్టాడు. అందుచేత ఆయన "భయపడకండి. ఎందుకు భయపడుతున్నారు? మీకు రాబోయే ప్రమాదమేమిటి?" అని ధైర్యం చెప్పుతూ తిరిగాడు. ఆయన రాజకీయంగా దేశమంతటా ప్రజలలో వ్యాపించిన భీతినిగురించి ఈ మాటలన్నాడు. బ్రిటిష్ ప్రభుత్వానికి సమ్మతం కాని ఏ పనినైనా మేము చేస్తే, వెంటనే శిక్షపడుతుంది. జైలుకు పంపుతారు. కాల్చి చంపినా చంపవచ్చు. అందుచేత దేశమంతా భయ

5. ఇది 1949 లో నెహ్రూ పలికిన వాక్యం.

భ్రాంతమయింది. తాను కష్టించి పండించిన పంట - అంతా దాదాపుగా భూస్వామికేపోయి, తనకు తిండికి కూడా చాలని నికృష్టస్థితిలోవున్న పేదరైతు ఈ భయానికే కంపించిపోయాడు. భూస్వామి, అతని గుమాస్తా, పోలీసు, ఋణదాత, ప్రతివాడూ ఆ దీనుణ్ణి కాలదన్ని చేతికి సంకెళ్ళు తగిలించేవాడే. ఎదురైన ప్రతివ్యక్తి అతనిపై అధికారం చూపేవాడే. ఇది తన కర్మఫలమనుకుంటూ అతడు అన్నిటికీ సహించి ఊరుకునేవాడు. ఆ వాతావరణంలో ఏమైనా ఉన్నదో, గాంధీజీ కంఠంలోనే ఏదైనా ఇంద్రజాలమున్నదో నాకు తెలియదు గాని, మొత్తం మీద ఆయన "భయపడకండి" అని అనగానే నిజంగా భయపడవలసినదేమీ లేదని మేము గుర్తించి ఆనందోత్సాహాలతో పొంగిపోయాము. దారిద్ర్య భారంతో క్రుంగిపోయిన రైతుకూడా ఒక్కమాటు తిన్నగా నిలబడి ఎదుటివారిని సూటిగా చూడగలిగాడు. అతని శుష్క నేత్రాలలో కూడా ఒక ఆశారేఖ మెరిసింది. భారతదేశంలో అద్భుతమైన మార్పు వచ్చింది.

ఎన్నో ఆటుపోటులను మేము తట్టుకోవలసివచ్చింది. "భయపడకండి" అని గాంధీజీ అన్నమాట ననుసరించి మేము ముందుకుసాగి, నిజంగా భయపడవలసిన ఆవసరమేమీ లేదని గుర్తించాము. భయం నిజానికి మాకు మేమే సృష్టించుకున్నదే. వేలసంఖ్యలో, లక్షల సంఖ్యలో జైళ్ళకు

వెళ్ళాము. అది కఠోర జీవితమే. అనేకులు ఎన్నో కష్టాలను, బాధలను సహించవలసి వచ్చింది. ఐనా జైలుకు వెళ్ళడంలో చిన్నతనమేమీ లేదని, అది మన దృక్పథం మీదనే ఆధారపడి వుంటుందని తెలుసుకున్నాము. ఏదైనా ఘోరమైన అపరాధంచేసి, అవమానంపాలై జైలుకు వెళ్ళితే అప్పుడు చాలా బాధగా వుండవచ్చు. కాని ఒక ఉన్నత లక్ష్యంకోసం జైలుకు వెళ్ళడానికి సంకోచించ నక్కరలేదు సరిగదా, అది కోరి పొందదగిన స్థితిగా పూకు తోచింది. ఈనాడు కూడా మనం అగ్రరాజ్యాలతో పోల్చి చూస్తే చాలా దుర్బలులుగానే ఉన్నాము గనుక ఈ మాట మీతో ప్రస్తాపిస్తున్నాను. యుద్ధమే తటస్థిస్తే, మనం శక్తి హీనులమే. మనకు అణ్వాస్త్రం లేదు. అయినా అణ్వాస్త్రం లేనందుకే మన మానందించాలని నేనంటాను.

ఎన్నో యుద్ధాలు జరిగాయి. మనకు విజయం చేకూరింది. విజయం చేకూరినందుకు ఆనందసంభ్రమాలతో వేడుకలు జరుపుకున్నాం. కాని నిజంగా ఏది విజయం? ఏవిధంగా దానిని నిర్ణయించ వీలవుతుంది? ఏవో కొన్ని లక్ష్యాలను సాధించడంకోసం యుద్ధం చేస్తారు. శత్రువును జయించడమే లక్ష్యంకాదు. శత్రువును జయించడంవల్ల లక్ష్యసాధనకు అడ్డుతగిలె ఆటంకం ఒకటి తొలగిపోతుంది. ఆ లక్ష్యమే సిద్ధించకపోతే, శత్రువును జయించడంవల్ల తాత్కాలికంగా కొంత ఓదార్పు కలుగుతుందేగాని, అది

నిజంగా విజయం కానే కాదు. అయినా తరుచుగా శత్రువును జయించే ఉద్దేశంతోనే యుద్ధాలు జరుగుతున్నాయనీ, ప్రధానలక్ష్యాన్ని మరచిపోవడం జరుగుతున్నదని మనకు తెలుసు. అందువల్ల శత్రువును ఓడించడం మూలంగా కలిగే విజయం కేవలం పాక్షికవిజయమే. ఆ విజయంవల్ల ముఖ్య సమస్య పరిష్కృతం కాదు తాత్కాలికసమస్యను ఆ విజయం పరిష్కరించినా, ఇంకా అనేక జటిల సమస్యలను అది సృష్టించిన సందర్భాలున్నాయి. అందుచేత శాంతి నెలకొన్నప్పుడు గాని, యుద్ధం తటస్థించినప్పుడు గాని, అన్ని వేళల మనం ప్రధానలక్ష్యాన్ని స్పష్టంగా దృష్టిలో వుంచుకొని, ఆ లక్ష్య సిద్ధికే కృషిచేయడం అవసరం.

మనం సాధించదలచిన లక్ష్యానికీ, ఆ లక్ష్యాన్ని సాధించడానికి మనముపయోగించే సాధనానికీ, సదా సన్నిహిత సంబంధం ఉంటుందని నేను భావిస్తాను. లక్ష్యం మంచిదైనా, సాధనం కుటిలమైనదైతే, అది కొంతవరకు లక్ష్యాన్ని కూడా కలుషితం చేస్తుంది. లేకపోతే మనల్ని కనీసం పెడదారి పట్టిస్తుంది. లక్ష్యమూ, సాధనమూ ఈ విధంగా పరస్పరము అల్లుకుపోయి వుంటాయి. వాటిని విడదీయడానికి సాధ్యం కాదు. చిరకాలంగా ఎందరో మహాపురుషులు బోధించిన ప్రాచీన పాఠమే ఇది. ఐనా దురదృష్టవశాత్తు ప్రజలీ పాఠాన్ని విస్మరిస్తూ వుంటారు.

నేను గాంధీజీ రక్షణలో పెరిగి, ఆయనచేత ఉత్తేజితుడ నయ్యాను. ఆయన సదా నైతిక ప్రమాణాలు

ముఖ్యమని చెపుతూ లక్ష్యంతో సమంగా సాధనాన్ని గురించికూడా శ్రద్ధవహించవలసినదని హెచ్చరించాడు. ఆయన సూచించిన ఉన్నత ప్రమాణాలను మేము అందుకోలేకపోయినా, నూశక్తికొద్దీ ఆయన బోధ ననుసరించడానికి యత్నించాము. పూర్తిగా కాక కొంతవరకే ఆయన బోధ ననుసరించగలిగినా, అందువల్లనే సత్ఫలితాలు కలిగాయి. ఒకతరంపాటు అతిశక్తిమంతమైన సామ్రాజ్యంతో పోరు సాగించి చివరకు విజయం సాధించాము. ఈ విజయం సిద్ధించిన విధం ఉభయ పక్షాలకు కీర్తిదాయకంగా ప్రాప్తించింది. ఈ విధంగా రెండు జాతులమధ్య ఏర్పడిన సంఘర్షణ ప్రశాంతంగా పరిష్కారమై, ఉభయులమధ్య స్నేహ సహకార సంబంధాలు నెలకొన్న సందర్భం ప్రపంచ చరిత్రలో మరొకటి లేనేలేదేమో! ఉభయజాతులమధ్య క్రోధద్వేషాలు ఇంత తొందరగా చల్లారి సహకారం కొనసాగడం చూస్తే ఆశ్చర్యంగా ఉంటుంది. స్వతంత్రదేశ పౌరులమైన మనం స్వయంగా ఈ సహకారం ఈ విధంగానే మునుముందుకూడా కొనసాగాలని నిర్ణయించాము.

ఈనాడు ప్రపంచంలో ఎన్నో క్లిష్ట సమస్యలు పొడసూపాయి. భారతదేశంలో జరిగిన శాంతియుత విప్లవం నేర్పిన పాఠాన్ని ఈ సమస్యలకు కొంతవరకు వర్తింపజేయవచ్చు. మనిషి భవితవ్యం కేవలం భౌతిక బలంమీదనే ఆధారపడిలేదని, పోరాటం సాగించిన తీరు, అది ముగిసే విధము

అతి ముఖ్యమైనవని మన శాంతియుత విప్లవం స్పష్టంచేసింది. భౌతికబలం ఏనాటికైనా నైతికశక్తులను తృణీకరించలేదని చరిత్ర చాటుతున్నది. ఎదిరిస్తే అది చివరకు ఓడిపోక తప్పదు. ఈనాడు భౌతికబలం ఘోరమైన మారణాయుధాలను నిర్మించడంచేత మనమీసమస్య నెదుర్కొనవలసి వస్తున్నది. ఆటవికయుగపు మనుష్యులకూ, ఆధునికులకూ గల భేదం కేవలం మానవజాతి నిర్మూలనానికి మానవుడు సృష్టించిన మారణాయుధాల మహత్తర వినాశకశక్తిలోనే కనిపించాలా ? ఈ సమస్యను పరిష్కరించడానికి మరొక మార్గమున్నదని, భౌతిక బలప్రయోగమే ఏకైకమార్గం కాదని మనదేశికుడు చేసిన బోధపై నాకు విశ్వాసమున్నది.

రాజకీయ సమస్యలను వెంటనే పరిష్కరించ వలసిన వ్యక్తి వాస్తవపరిస్థితులను గమనించకుండా కేవలం తాత్త్వికాచార్యులనే అనుసరించడానికి వీలు కాదని నేనెరుగుదును. తన తోటిపౌరులా ఆదర్శాలను ఎంతవరకు గ్రహించి పాటించగలరో గమనించి, అతడు తదనుగుణంగా తన కార్యకలాపాలను రూపొందించుకొనవలసి వుంటుంది. అయితే తాత్త్విక సత్యం చెక్కుచెదరకుండా కలకాలం నిలిచే వుంటుంది. దానిని సదా దృష్టిలో వుంచుకుంటూ, సాధ్యమైనంతవరకు మన ఆచరణను దానిప్రకారం చక్కదిద్దుకోవాలి. లేకపోతే మనం వక్రమార్గవిషవలయంలో చిక్కుకుని, ఒక అకృత్యం తరువాత మరొక అకృత్యం చెయ్యవలసి వస్తుంది.

భారతదేశం మహోజ్జ్వల గతచరిత్రగల ప్రాచీన దేశమే అయినా, ఒకవిధంగా అది క్రొత్తఆశలతో, ఆశయాలతో, తొణుకాడుతున్న నూతనదేశమని కూడా అనవచ్చు. 1947 ఆగస్ట్ మాసంనుంచి ఈదేశం స్వేచ్ఛగా తన విదేశాంగవిధానాన్ని రూపొందించుకోవడానికి వీలయింది. ప్రపంచస్థితిగతుల యథార్థస్వరూపాన్ని నిర్లక్ష్యం చేయక, వాటి కనుగుణంగానే తనరాజకీయ విధానాన్ని మలచుకోవలసివచ్చినా, తన నాయకాగ్రణి బోధించిన పాఠాన్ని కూడా ఈ దేశం మరచిపోలేదు. తన శక్తిమేరకు ఆ సిద్ధాంతాన్ని ఆచరణలో సాధించ యత్నిస్తున్నది.

ప్రపంచరాజ్యాలలో భారతదేశం క్రొత్తదేశంగా అడుగు పెట్టింది. క్రొత్తదేశం కావడంచేత మొదట దానికి ఎక్కువ పెట్టుబడి లేకపోయింది. అయినా అదృష్టవశాత్తు తనశక్తిని, ప్రాభవాన్ని అధికం చేసుకోవడానికి కావలసిన వనరులున్నవి పైగా రాజకీయంగా ఇతరదేశాలతో స్వేచ్ఛగా నూతన సంబంధాలేర్పరచుకోగల సదవకాశం కూడా లభించింది. ఇటీవలనే స్వాతంత్ర్యంపొందిన దేశం కావడంచేత పూర్వవిరోధాలతో, స్నేహాలతో, పోటీలతో ప్రమేయంలేకుండా తన సంబంధాలను క్రొత్తగా రూపొందించుకున్నది. అప్పటివరకు తనపై అధికారం సాగించిన విదేశీయ పాలకులనుకూడా భారతదేశం ద్వేషించలేదు. ఈ విధంగా ప్రపంచరాజ్యాల మధ్యకు భారతదేశం ఎట్టి

ద్వేషాలూ, విరోధాలూ లేకుండా, అందరితో స్నేహ సంబంధాలను ఆకాంక్షిస్తూ వచ్చింది. విధిగా తన ప్రయోజనాలను అది దృష్టిలో వుంచుకుంటూ విదేశాంగ విధానాన్ని మలచుకోవలసివచ్చినా, కొంతవరకు ఆదర్శవాదంతో దానిని రూపొందించింది. ఇట్లా అది జాతీయ ప్రయోజనాలను ఆదర్శాలతో జోడించింది.

ఏ అగ్రరాజ్యాల కూటమిలోనూ చేరిపోక, ప్రతి వివాదాన్ని స్వతంత్రంగా పరిశీలించి, న్యాయాన్ని సమర్థిస్తూ శాంతి పరిరక్షణకు కృషిచేయడం, ఇంకా విదేశ పాలనలో మగ్గుతున్న ప్రజలకు స్వాతంత్ర్య ప్రతిపత్తి కల్పించడం, వైయుక్తిక, జాతీయస్వేచ్ఛా పరిరక్షణ, జాతి విచక్షణ విధానాన్ని అంతమొందించడం, ప్రపంచలో అధిక సంఖ్యాకులను క్రుంగదీస్తున్న దారిద్ర్యాన్ని, రోగాలను, అజ్ఞానాన్ని తొలగించడానికి కృషిచేయడం - ఇవే మన విదేశాంగ విధానంలో ముఖ్యలక్ష్యాలు. మనదేశ మనుసరిస్తున్న విధానం వ్యతిరేక విధానమూకాదు. తటస్థ విధానమూ కాదు. అది మన స్వాతంత్ర్యోద్యమమూ, గాంధీ మహాత్ముని బోధలూ రూపొందించిన స్వతంత్ర్య చైతన్య పూర్ణ విధానం.

భారతదేశ పురోభివృద్ధికి శాంతి ముఖ్యం. ప్రపంచ క్షేమానికికూడా శాంతి ముఖ్యమే. ఈ శాంతిని పరిరక్షించడ మెట్లా? దురాక్రమణకు లొంగడంచేతకాదు. అన్యాయాన్ని, దుర్మార్గాన్ని, చూసీ చూడనట్టు ఉపేక్షించడం

చేతనూ కాదు. అయితే నిత్యమూ యుద్ధాన్ని గురించే మాట్లాడుతూ, అందుకు సన్నాహాలు చెయ్యడం చేత అసలే కాదు! దురాక్రమణవల్ల శాంతికి భంగం కలుగుతుంది కాబట్టి దానిని ప్రతిఘటించితీరాలి. అయితే ఈ శతాబ్దంలో సాగిన రెండు ప్రపంచయుద్ధాలు నేర్పిన పాఠాన్ని కూడా మనం మరువకూడదు. ఈ యుద్ధాలవల్ల జరిగిన నష్టాన్ని గురించి తెలిసికూడా మనమింకా వెనుకటి దారిలోనే నడుస్తూవుండడం అత్యంత విస్మయకరమైన విషయం. ప్రపంచాన్ని పరస్పరం ఎదుర్కొంటున్న రెండు ప్రతికూలవర్గాలుగా విభజించడమే పెద్ద తప్పు. ఆ విభజన సంఘర్షణను నివారించదు సరిగదా, స్వయంగా సంఘర్షణకు దారితీస్తుంది. ఈ విభజనవల్ల ప్రజలలో విపరీతమైన భయం వ్యాపిస్తుంది. ఆ భయమే ఎన్నో అనర్థాలను కలిగిస్తుంది. బహుశా జీవితంలో భయంకంటె చెడ్డది, ప్రమాదకరమైనది మరేమీలేదేమో! అమెరికా దేశపు అధ్యక్షులలో ప్రసిద్ధుడొకాయన అన్నట్టు భయంకంటె నిజంగా భయపడవలసినది మరేదీలేదు.

కనుక ఈ భయాన్ని క్రమంగా తగ్గించుకుంటూ, ఒకనాటికి పూర్తిగా నిర్మూలించడమే మన సమస్య. ప్రపంచంలోని దేశాలన్నీ ఏదో ఒక కూటమిలోచేరి, ఏదో ఒక పక్షాన్ని సమర్థిస్తూ, యుద్ధాన్ని గురించి ప్రస్తావిస్తున్నంతవరకు భయం తొలగిపోదు.

అప్పుడు యుద్ధం తప్పనిసరిగా వస్తుంది. మన లోపాలు, అశక్తత మనకు తెలియకపోలేదు. కాని మనం ఏ కూటమి లోనూ చేరకపోవడంవల్ల ప్రతి సమస్యను నిష్పాక్షికంగా చూడగల అవకాశం మన కేర్పడింది. ఈ సదవకాశాన్ని మనం విడనాడకూడదు. ఈ సదవకాశం మనకు లాభ కరంగా ఉండడమేగాక, ప్రపంచశాంతికీ, స్వేచ్ఛకూ ఇది ప్రయోజనకారి అని మన నమ్మకం. మన విదేశాంగ విధా నం ఇతరులతో ఏ సంబంధమూ లేకపోవడమూ కాదు, వారి సమస్యలపట్ల నిర్లక్ష్యమూ కాదు, స్వేచ్ఛాశాంతుల పరిరక్ష ణకు సంబంధించినంతవరకు తాటస్థ్యమూ కాదు. మానవుల స్వాతంత్ర్యానికి గాని, శాంతికి గాని ప్రమాద మేర్పడి నప్పుడు మనం తటస్థంగా ఉండలేము. అప్పుడు తటస్థంగా ఉండడమంటే ఇంతకాలంగా మనం పోరాడి పాటించిన ఆదర్శాలకు తిలోదకా లివ్వడమన్న మాటే.

ప్రపంచరాజకీయాలలోనికి భారతదేశం ఇటీవలనే ప్రవేశించిన మాట సత్యమే. నేటి అగ్రరాజ్యాలతో పోల్చి చూస్తే మనకు చెప్పుకోదగ్గ సైనికబలం లేని మాటకూడా సత్యమే. అయితే ఈ దేశం అతి ప్రాచీనమైనది. బహు శతాబ్దాలుగా అనంత జీవనయాత్ర సాగించి వివేక విజ్ఞత లను గడించింది. ఈ సుదీర్ఘ చరిత్రలో ఈ దేశం సదా శాంతినే కాంక్షించింది. భారతీయులు చేసే ప్రతి ప్రార్థన శాంతి వచనంతోనే సమాప్తమవుతుంది. ప్రాచీనమూ,

అయినా నవీనమూ అయిన ఈ దేశంలోనే గాంధీమహాత్ము డుదయించాడు. ఆయన శాంతియుతమైన కార్యాచరణ విధానాన్ని మనకు నేర్పాడు. ఆ విధానమే మనకు ఫల సిద్ధిని కలిగించి, మనకు స్వాతంత్ర్యాన్ని చేకూర్చడమే కాదు, నిన్నటివరకు మనం ప్రతిఘటించిన వ్యక్తులతోనే స్నేహాన్నికూడా అది సంఘటించింది. ఈ విధానాన్ని ఇంకా విస్తృతంగా ఇతర రంగాలలోకూడా అనుసరించ డానికి సాధ్యమవుతుందో, లేదో నేను చెప్పలేను. పరిస్థి తులు మారుతూవుంటాయి. దుష్టశక్తుల స్వభావాన్ని బట్టి ఆ శక్తులను అణిచివేసే విధానాన్ని రూపొందించుకోవాలి. అయినా ఆయన బోధించిన కార్యాచరణవిధానమే ప్రజల సమస్యలను పరిష్కరించడాని కనుకూలమైనదని, ఏ సమస్యా నైనా పూర్తిగా సంతృప్తికరంగా పరిష్కరించడానికి వేరే మార్గమేదీ లేదని నా నమ్మకం.

మనం స్వాతంత్ర్యాన్ని గడించి, రక్షించుకోవాలి. దురాక్రమణను ప్రతిఘటించాలి. అందుకు తగిన బలాన్ని సమకూర్చుకోవాలి. కాని దురాక్రమణ నెదుర్కొడానికి సన్నాహం చేస్తునప్పుడుకూడా, మనస్సులో భయద్వేషా లకు చోటివ్వక, శాంతి సఖ్యాలే మన అంతిమ లక్ష్యమన్న సంగతి సదా దృష్టిలో ఉంచుకోవాలి. మన విదేశాంగ విధానానికి ప్రాతిపదిక ఇదే.

వాస్తవ పరిస్థితులను మనం ఉపేక్షించడం లేదు. మానవజాతి స్వాతంత్ర్యానికి ఏ రూపంలో ప్రమాదం తట

స్థించినా, మనం చూస్తూ ఊరుకోబోము. ఎక్కడైనా స్వాతంత్ర్యానికి భంగం కలిగినా, న్యాయానికి చెల్లుబడి లేక పోయినా, దురాక్రమణ జరిగినా మనం తటస్థంగా ఉండ లేము. అట్లా ఉండబోము. మనం చెప్పేదల్లా శాంతియుత పద్ధతులయందే మనకు పరిపూర్ణ విశ్వాస మున్నదని, ఆ విశ్వాసంతోనే మాటలతోనూ, చేతలతోనూ మనం శక్తికొద్దీ శాంతి సాధనకే యత్నిస్తున్నాము.

గడచిన ముప్పై యేళ్ళుగా [6] మేము భారతదేశ స్వాతంత్ర్యం కోసం తదేకదీక్షగా జాతీయోద్యమాన్ని సాగించాం. ఆ ఉద్యమాన్ని మేము ప్రారంభించలేదు. అప్పటికే అది సాగుతున్నది. మాకంటె ముందు కొన్ని తరాలుగా స్వాతంత్ర్య సమరం సాగుతూనేవుంది. కాని ముప్పై యేళ్ళ క్రిందటనే అది ప్రపంచప్రజల దృష్టి నాకర్షిం చింది. ప్రపంచ దృష్టిని ఆకర్షించగల విశిష్టనాయకుడు గాంధీమహాత్ముడు భారత రాజకీయరంగస్థలం మీదికి అప్పుడే అడుగు పెట్టడమే అందుకు కారణం. ఆయన భారతదేశంలో మహత్తర పరిణామాన్ని కలిగించాడు.

అప్పుడు నేను చాలా చిన్నవాణ్ణి. అయినా ఆ మహత్తర పరిణామం నాకిప్పటికీ జ్ఞాపకం. ఎందుచేతనంటే మనదేశంలోని అనేక లక్షల జనులతోపాటు నేను కూడా ఆ పరిణామానికి గురి అయ్యాను. మాలో కలిగిన మార్పు

6 1949 లో అన్న వాక్యం.

చాలా చిత్రమైనది. అప్పటికి మేమందరం స్వరాజ్యం కావాలని గాఢంగా కోరుతూ, ఏవిధంగా దానిని సాధించ గలమో తెలియక, నిరాశతో క్రుంగిపోయి వున్నాము. నూటయాభై యేళ్ళ పైబడి మన దేశంలో వేళ్ళు పాతు కున్న సామ్రాజ్యాన్ని ఎదుర్కొనగల శక్తి లేక, నిస్సహా యులమై, నిరాయుధులమై, క్రమపద్ధతిలో సంఘటితం కాక, దిక్కూ, తెన్నూ తెలియక చెదిరివున్నాం. విదేశ ప్రభుత్వం కూడా కేవలం సైనికబలం అండదండల మీదనే నిలిచి వున్నది కాదు. మనదేశంలో లోతుగా వేళ్ళు పాతు కుని స్థిరపడినట్టిది. దానిని తొలగించడం దుష్కర మని పించింది.

ఆ నిరాశను భరించలేక మన యువకులు కొందరు దౌర్జన్యచర్యల కుపక్రమించారు. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది. ఇక్కడా, అక్కడా చెదురుగా దౌర్జన్య పూరిత సంఘటనలు జరిగినా, అప్పుడు దేశంలో వ్యాపించి వున్న పరిస్థితులలో ఆ సంఘటనల కేమీ అర్థమూ, ప్రయో జనమూ లేకుండా పోయింది. మరొకవంక మన రాజకీయ నాయకుల నీరసధోరణి ఏ విధంగానూ స్వరాజ్య సాధన కుపకరించలేదు.. ఒక వంక దౌర్జన్యంతో స్వరాజ్యం సాధించ గోరే యువకులు, మరొకవంక జవసత్త్వాలు లేనట్టు నీర సంగా కృషిచేసే నాయకులు—ఈ రెండువర్గాల మధ్య మాకు ఏమి చెయ్యాలో తెలియలేదు. ఆత్మాభిమానం

చంపుకుని విదేశ ప్రభుత్వానికి దీనంగా విజ్ఞప్తులు చేసుకుందామని చెప్పే నాయకుల ధోరణి మాకు అవమానకరంగా తోచింది. అయితే కేవలం హింసతో, దౌర్జన్యంతో స్వరాజ్యం ఎటూ సిద్ధించదు గనుక, అది సరియైన మార్గం కాదు గనుక, ఆ రెండవపక్షాన్ని కూడా సమర్థించలేక పోయాము.

మేమటువంటి సందిగ్ధావస్థలో వుండగా గాంధీజీ మన రాజకీయరంగంమీదికి ప్రవేశించి, ఒక నిర్దిష్ట కార్యక్రమాన్ని ప్రతిపాదించాడు. ఆయన సూచించిన కార్యక్రమం నూతనంగా, విలక్షణంగా కనిపించింది. ఆయన మాటలలో కొత్తదనమేమీ లేదు. చిరకాలంగా ఎందరో మహాపురుషులు చెప్పిన మాటలే అవి. కాని గాంధీజీ ఆ బోధను సాముహిక రాజకీయోద్యమానికి వర్తింపజేశాడు. వ్యక్తిగత జీవితంలో ఎవరికి వారు పాటించడాని కేర్పడిన నైతిక సూత్రాన్ని గాంధీజీ ఈ సువిశాల దేశంలో సాముహికంగా సాగే ఉద్యమానికి అన్వయించాడు. ఆనాడు ప్రజలు చాలావరకు నిరక్షరాస్యులు, భయభ్రాంతులు, శిక్షణ రహితులు. నూటికి ఎనభై వంతులమంది పల్లెటూళ్ళలో వ్యవసాయమే జీవనాధారంగా గల రైతులు. వారు భయభ్రాంతులై వుండడం సహజమే. ఎందుచేతనంటే వారికెదురైన ప్రతివ్యక్తి - ప్రభుత్వోద్యోగి కానివ్వండి, ఋణదాత కానివ్వండి—వారిని హింసించి, అవమానించి, చేతు

లకు సంకెళ్ళు తగిలింప జూసేవాడే. వారు విపరీతమైన భారం మోస్తున్నారు. ఆ భారం నుంచి విముక్తి మాత్రం కనుచూపుమేరలో ఎక్కడా కనిపించలేదు.

ఆ స్థితిలో వుండగా గాంధీజీ వచ్చి ఈ దౌర్భాగ్యస్థితిని తొలగించుకోవడానికి, స్వరాజ్యం సాధించడానికి ఒకమార్గం ఉన్నదన్నాడు. "మొట్టమొదట భయాన్ని విడిచిపెట్టండి. భయపడకండి. అందరూ ఏకమై శాంతియుతంగా కృషి చెయ్యండి. హృదయంలో మీ విరోధిపట్ల ద్వేషభావాన్ని తలయెత్తనీయకండి. మీరు ప్రతిఘటిస్తున్నది ఒక రాజకీయ తత్త్వాన్ని. అంతేగాని ఒక వ్యక్తినో, జాతినో, మరొక దేశపు ప్రజలనో కాదు. మీరు సామ్రాజ్యవాదతత్త్వాన్ని, వలసతత్త్వాన్ని ఎదిరిస్తున్నారు" అని ఆయన అన్నాడు.

ఆయన మాటలు మాకు సులభంగా అర్థంకాలేదు. మాకే అర్థంకాలేదంటే, ఇక పల్లెటూళ్ళలోని రైతుల సంగతి వేరే చెప్పనక్కరలేదు. అయినా గాంధీజీ కంఠంలో ఏదో శక్తివుంది. అది ఇతరులలో ధైర్యం కలిగించే శక్తి. ఆయన వ్యర్థప్రసంగాలుచేసే నాయకుడు కాదనీ, అనే మాటలన్నీ సార్థకమైనవనీ, ఆయన స్వరాజ్యం సాధించ గలడనీ మాకు నమ్మకం కలిగింది.

ఆయన ప్రభావం ఇంద్రజాలంవలె వ్యాపించింది. అంతకు ముందే ఆయన ప్రసిద్ధుడు, కాని అప్పటి ఆయన ప్రభావం మాత్రం అపూర్వమని చెప్పాలి. కొన్ని మాసాల

లోనే మన గ్రామసీమలలో మార్పు కనిపించింది. రైతుల ధోరణి మారింది. వారు తలయెత్తి నిలబడగలిగారు. వారిలో ఆత్మవిశ్వాసం, స్వశక్తిపై ఆధారపడాలన్న పట్టుదల కనిపించాయి. ఈ మార్పు తనంతట తానే కలుగలేదు. వేనవేలు యువతీ యువకులు గాంధీజీ సందేశాన్ని పల్లెటూళ్ళకు తీసుకువెళ్ళారు. ముందుగా వారు గ్రామీణ ప్రజలకీ సందేశాన్ని వినిపించారు. ఆ సందేశాన్ని వారు హర్షించి స్వీకరించారు. అందువల్ల కొన్ని మాసాలలోనే భారతదేశంలో బ్రహ్మాండమైన మార్పువచ్చింది.

"భయపడకండి" అని చెప్పడంలో అసాధారణమైన విశేషమేమీ లేదు. మేము దేనికి భయపడుతున్నాం? సాధారణంగా ఒక వ్యక్తి ఎందుకు భయపడుతాడు? చాలా కారణాలు కనిపించాయి. ప్రభుత్వం జైళ్ళలో నిర్బంధిస్తుందేమోనని భయం. రాజద్రోహమనే పేర మా ఆస్తిపాస్తులను ప్రభుత్వం వశం చేసుకుంటుందేమోనని భయం. తిరుగుబాటుదారులని మమ్మల్ని కాల్చి చంపుతుందేమోనని భయం. గాంధీజీ అప్పుడు మాకు ధైర్యం చెప్పాడు. "నిజంగా మీకు స్వరాజ్యం సాధించాలన్న పట్టుదలవుంటే, జైలుకు పోవలసివచ్చినా, ఆస్తిపోయినా, చివరకు ప్రాణమేపోయినా ఎందుకు సంకోచించాలి? మీ త్యాగానికి మహత్తరమైన ప్రతిఫలం లభిస్తుందిగదా. ఒక ఉత్తమ లక్ష్యంకోసం పాటుపడి, బహుశా ఫలసిద్ధిని

పొందడం మాట అటుండగా, ఈ ఉద్యమంలో పాల్గొం టున్నందుకే మీకు కొంత సంతృప్తి, ఆనందం కలుగుతా" యని ఆయన వాదించాడు.

మొత్తంమీద గాంధీగారి మాటలు ప్రజలకు పూర్తిగా నచ్చాయి. వెంటనే దేశంలో గొప్ప మార్పు వచ్చింది. ఈ విధంగా భారతదేశ రాజకీయాలలో "గాంధీ యుగం" ప్రారంభమయింది. ఆయన జీవించినంతకాలం అది సాగింది. ఏదో రూపంలో అది మునుముందుకూడా సాగుతూనేవుంటుంది. అనేకులం మా వృత్తులను, పని పాట లను వదులుకుని ఈ సందేశాన్ని ప్రచారం చెయ్యడానికి పల్లెటూళ్ళకు వెళ్ళాం. మా రాజకీయవ్యవస్థ కోరిన ఇతర సందేశాలనుకూడా ప్రచారం చేశాం. అట్లాచేస్తూ, మా పూర్వపు వృత్తులను పూర్తిగా మరచిపోయాం. మా జీవి తాలు కానరాకుండానే పూర్తిగా మారిపోయాయి. అంతకుముందు మేము చేస్తూవుండిన పనిపాటలలో ఆసక్తి అంతరించింది. అప్పుడు చేస్తున్న పనిమీదనే మా దృష్టి నిలిచింది. ఈ విధంగా కొన్ని ఏళ్ళు గడిచాయి. ఆ రోజు లలో మా ఊహాలూ, చేతలూ ఒక్కమార్గాన్నే అనుస రించడంచేత అంతరంగంలో ఎటువంటి సంఘర్షణకు తావులేక పోయింది. మా కృషి మాకు అమితమైన సంతృప్తినిచ్చింది. ఫలితాలకోసమే కృషిచేస్తున్నాం. అయినా అప్పుడు మాత్రం ఫలితాలతో నిమిత్తం లేకుండా కృషిలోనే మాకు

సంతృప్తి కలిగింది. ఎన్నో ఆటుపోటుల నెదుర్కొన్నాం. తాత్కాలికంగా పరాజయం ప్రాప్తించేది. కాని గాంధీజీ బోధించిన కార్యాచరణ విధానపు లక్షణ మెటువంటిదంటే, మా కృషిలో తాత్కాలికంగా ఓటమి కలిగినా, ఇక వెనుకంజవేసే ప్రసక్తి ఉండేదే కాదు.

ఈ కార్యాచరణ ప్రణాళికలో సామూహికోద్యమం ద్వారా ప్రభుత్వాన్ని కదిలించడం కూడా ఒక అంశమే. అయినా అదే ముఖ్యాంశం కాదు. వ్యక్తిగతంగా ప్రభుత్వాన్ని ధిక్కరించి, ఆ విధంగా ప్రభుత్వ గౌరవాన్ని కించపరచడమే దీని ప్రధానలక్ష్యం. అమెరికన్ రచయిత థొరో రచనలలో మీరు ప్రభుత్వాన్ని ఈ విధంగా చులకన చేయడాన్ని గురించి చదివివుంటారు. ఆ పద్ధతినే గాంధీజీ జనసామాన్యమంతా పాల్గొనడాని కనువుగా విస్తృతం చేశాడు. మనదేశప్రజ లప్పటికి సుశిక్షితులుకారు. ఈ కార్యాచరణ పద్ధతి ఆంతర్యమేమిటో వారికి పూర్తిగా బోధపడలేదు. అనేక లోపాలున్న సామాన్య మానవులు కావడంచేత వారి ఉద్యమంలో అప్పుడప్పుడు తప్పటడుగులు వేయడం జరిగింది. అయినా మొత్తంమీద వారు గాంధీజీ బోధించిన విధానాన్నే అనుసరించారు. అందుకే చివరకు విజయం సాధించారు.

గాంధీజీ కార్యాచరణ విధానం శాంతియుతమైనది. అయినా అది ఫలప్రదమైనది. వెంటనే ఫలితాల నిచ్చింది.

స్వాతంత్ర్యం లభించిన పద్ధతిని, ఉభయదేశాల మధ్య చివ రకు ద్వేషం లేకపోవడాన్ని చూస్తే, ఆ కార్యాచరణ విధానం ఎంత ఫలప్రదమైనదో మనకు తెలుస్తుంది. స్వాతంత్ర్యం సిద్ధించాక మనకు బ్రిటన్‌పట్ల ద్వేషభావం లేనే లేదని నే ననను గాని, ఆ దేశంపట్ల అనుమానం, ఆగ్రహం, ద్వేషం క్రమంగా చల్లారిపోవడం మాత్రం ఆశ్చర్యకరమైన విషయమే.

ఒక సమస్యను మనం పరిష్కరించాలనుకోండి. పరిష్కరించడంవల్ల రెండు మూడు క్లిష్టసమస్యలు కొత్తగా ఉత్పన్నమయ్యేటట్టు దానిని పరిష్కరించడంలో అర్థం లేదు. కాని సాధారణంగా జరిగేది మాత్రమదే. గాంధీజీ మాత్రం ఇక ఆ సమస్యాపరిష్కారమైన తరువాత దాని మూలాన మరొక సమస్య తలయెత్తకుండా చాలా దక్ష తతో పరిష్కారమార్గం నిర్ణయించేవాడు.

అణ్వాస్త్రం మూలాన ఏ క్షణాన మనమీద ఏ ఆపద విరుచుకుపడుతుందోనని సదా మనం భయభ్రాంతులమై వుండడం శోచనీయం. వెంటనేగాని, ఇంకా కొన్ని యేళ్ళలోగాని ఈ ప్రమాదం తటస్థిస్తుందనే భయం నాకు లేదు. ఈ కొద్దియేళ్ళలోనూ మనం భయపడక అందుకు తగినట్టు కృషిచేస్తే, ఈ ప్రమాదం అసలు రాకుండానే నివా రించవచ్చు. భయంవల్ల ప్రజలు తొందరపడి ప్రమాదానికి దారితీసే పనులేవీ చెయ్యకుండా ఉండడమే ప్రస్తుత సమస్య.

మన మొక విషవలయంలో చిక్కుకున్నాం. ఈనాడు ప్రపంచంలో యుద్ధాన్ని కోరేవాళ్ళు చాలా తక్కువమంది ఉంటారని, ఏదేశంలోనైనా అసంఖ్యాక ప్రజలు - బహుశా అందరూ - శాంతినే వాంఛిస్తారని నా నమ్మకం. అయినా మనం సదా యుద్ధభయంతో ఉన్నామంటే మన ఊహాలలోనో, చేతలలోనో ఏదో లోపముండాలి. మన మీ వ్యూహంలో ఎందుకు చిక్కుకున్నాం? ఇందులో మన తప్పేమీ లేదని, తప్పంతా ఎదుటివారిదని మనం అనవచ్చు. అది సత్యమే. అయినా మన మీ సందిగ్ధావస్థలో చిక్కుకోవడం మన లోపమే అవుతుంది. ఈ సందర్భంలో గాంధీజీ మాకు చేసిన హెచ్చరిక గమనించ దగినది. "మీరు సాగిస్తున్న జాతీయోద్యమంలో మీకు తటస్థించే పరాజయాలకు బ్రిటిష్ వారిని నిందించడంలో అర్థం లేదు. మీకు వారు తప్పక అడ్డువస్తారు. అదే వారి కర్తవ్యం. వారు మీతో ఏకీభవించనంతవరకు, ఈ సమస్య పరిష్కారం కానంతవరకు, వారు మీకు అడ్డు తగులుతూనే వుంటారు. అయినప్పుడు అడ్డు తగులుతున్నారని, ఓడిస్తున్నారని వారిని మీరు నిందించడంవల్ల ప్రయోజనమేమిటి? అది మీ లోపాన్నే సూచిస్తుంది. మీకు జయం సిద్ధించకపోతే అది మీ లోపం. బ్రిటిష్ వారి లోపం కాదు. అందుచేత వారిని నిందించడంవల్ల ఏమీ ప్రయోజనం లేదు" అని ఆయన మాతో చెప్పాడు.

ఇతరులను నిందించడంవల్ల లాభంలేదు. వారు నిజంగా నిందార్హులే కావచ్చు. అయినా మన కది అప్ర

స్తుతం. ఇతరుల స్నేహాంమీదనో, ద్వేషంమీదనో ఆధార పడక మనం మార్గాంతరం చూసుకోవాలి. లేనిపక్షంలో యుద్ధమూ, శాంతీ మనకు మారుగా ఇతరులు నిర్ణయించడం, ఆ నిర్ణయానికి నిస్సహాయంగా మనం బద్ధులం కావడం జరుగుతుంది.

ఈ సందిగ్ధావస్థ నుంచి సునాయాసంగా బయటపడే మార్గమేదీ నేను సూచించలేను. రాజకీయవేత్త కిది చాలా క్లిష్టసమస్య. ఎందుచేతనంటే బాధ్యతగల ఏ వ్యక్తిఅయినా చూస్తూచూస్తూ తనదేశ స్వాతంత్ర్య పరిరక్షణకు ప్రమాదం కలిగించే నిర్ణయాన్ని సాహసించి ఆమోదించలేడు. ఏనాడు ఎట్లా వుంటుందోనని ముందుగా జాగ్రత్తపడక తప్పదు. దురాక్రమణ నెదిరించడానికి సిద్ధంగా వుండాలి. మానవ స్వభావం మారనంతవరకు అతడు కేవలం శాంతియుతంగానే ప్రతిఘటించే సంకల్పంతో, "మే మెవ్వరికీ ఏ అపకారమూ తలపెట్టం. ఎవ్వరూ మా జోలికి కూడా రారని మా ఆశ" అంటూ ఊరికే కూర్చోవడానికి వీలులేదు. సాహసించి ఏ నిశ్చయానికీ రావడానికి వీలులేదు. ఏ ప్రమాదానైనా ఎదుర్కోవడానికి అతడు సిద్ధంగా వుండాలి.

అయితే ఇట్లా ఆత్మరక్షణకై సైనిక సన్నాహాలు చేసుకోవడంవల్లనే ఒకొక్కప్పుడు సంఘర్షణకు అవకాశాలెక్కువవుతాయి. ఈసారి ప్రపంచవ్యాప్తంగా సంఘర్షణ తటస్థిస్తే, ఇంతకు ముందెన్నడూ లేనంత ఘోరప్రమాదం

సంభవిస్తుంది. ఏమి జరుగుతుందో ఎవరికీ నిశ్చయంగా తెలియదుగాని, ఆధునిక ప్రపంచ వ్యవస్థ, వర్తమాన సభ్యతా, సంస్కృతులు సమూలంగా నశిస్తాయని మాత్రం నిశ్చయంగా చెప్పవచ్చు.

ఈ విధంగా మానవజాతి మనుగడకే ఘోరప్రమాదం జరిగే అవకాశ మున్నప్పుడు దీనిని కేవలం జయాపజయాల దృష్టితో చూడడానికి వీలులేదు. మన మాట చెల్లించుకోవడానికి అనుకూలపడుతుంది గనుక విజయ మెప్పుడూ కోరదగినదే. కాని మనం నిజంగా సాధించదలచిన లక్ష్యాలను గురించి కూడా ఆలోచించవలసి వుంటుంది. ఏవో కొన్ని లక్ష్యాలను సాధించడం కోసమే యుద్ధం చేస్తారు. విజయమే లక్ష్యం కాదు. లక్ష్యసాధనకు విజయం ఒక మెట్టు మాత్రమే. ఆ లక్ష్యాన్నే మరచిపోతే, విజయం కేవలం నిరర్థకమే. ఏదో గెలిచామన్న సంతృప్తి తప్ప, లక్ష్యం సిద్ధించదు. అందుచేతనే ఈ శతాబ్దంలో జరిగిన ప్రపంచ యుద్ధాలు రెండూ సైనిక దృష్ట్యా బ్రహ్మాండమైన విజయాలను సాధించినా, ప్రపంచంలో చెలరేగిన స్పర్థలను, వివాదాలను తొలగించలేకపోయాయి.

ఈ సందర్భంలో గాంధీజీ బోధించిన శాంతియుత కార్యాచరణవిధానం ఎంతవరకు అనుకూలిస్తుందో పరిశీలించడం మంచిది. ఆచరణలో అది ఎంతవరకు ఉపయోగపడుతుందో నేను చెప్పలేను. ఆచరణ చాలా కష్టసాధ్యమని

నాకు తెలియకపోలేదు. అయితే అది ఆచరణసాధ్యమైనా, కాకపోయినా, మానసికంగా ఆయన బోధించిన సూత్రం మనకు చాలా మేలు కలిగిస్తుందని నా నమ్మకం.

భారతదేశం వేనవేలేండ్ల చరిత్రగల ప్రాచీనదేశమే అయినా ఈ నాడది ప్రపంచంలో చైతన్య పూర్ణమైన యువదేశంగా కనిపిస్తున్నది. ముప్పై యేళ్ళపాటీదేశం స్వాతంత్ర్యంకోసం సాగించిన జాతీయోద్యమం మీదనే తన దృష్టిని కేంద్రీకరించింది. గాంధీమహాత్ముని నాయకత్వాన సాగిన ఆ స్వాతంత్ర్య సమరం అపూర్వమైనది. ఈ నాడు మా జాతి జనకుడని పిలుచుకుంటున్న ఆ మహానీయుని మహత్త్వపూర్ణ వ్యక్తిత్వ కాంతులు మా దేశంలో, ముఖ్యంగా మా తరం ప్రజలలో. ప్రతిఫలించాయి. అందు చేత ఈనాడు మేము ప్రపంచంలోని వివిధ రాజ్యాలతో సంబంధాలేర్పరచుకుంటూ మా విదేశాంగ విధానాన్ని రూపొందించుకోవడంలో, స్వాతంత్ర్య సమర కాలంలోని ఆదర్శాలను ఆచరణకు అన్వయిస్తూ గాంధీజీ మాకు చూపిన దారినే మేమనుసరిస్తున్నాము. ప్రపంచ రాజకీయ వ్యవహారాలలో భారతదేశం ఫలప్రదమైన పాత్రను నిర్వహించాలన్నా, తన అభ్యున్నతి కోసమది సక్రమంగా కృషి చెయ్యాలన్నా, ఇన్నాళ్ళుగా అది పాటించిన ఆదర్శాలనే శిరసా వహించాలి. శాంతి, సహకారం, జాతీయ స్వాతంత్ర్యం, క్రమంగా వసుధైక ప్రభుత్వస్థాపనకు దారితీసే అంతర్జాతీయ

త_త్త్వం, ప్రపంచంలో సమస్త జాతులమధ్య సమతాభావం, అనేక లక్షల జనులను పీడిస్తున్న దారిద్ర్య దుఃఖ నిర్మూలనం- ఇవే మాదేశం మన్నించే ఆదర్శాలు.

పేదసాదల జీవనస్థితిని బాగుచేసే ఆశయంతోనే స్వాతంత్ర్య సమరాన్ని సాగించడం గాంధీజీ మాకు బోధించాడు. అందుచేత మా జాతీయోద్యమంలో రాజకీయాలతో అర్థిక సమస్యలు కూడా ముడిపడినవి. ఎప్పుడూ లేమితోనే బాధపడే వారికి నిజంగా స్వాతంత్ర్యమంటూ ఉండదు. మన దేశంలో కోట్లకొలది ప్రజలు జీవితంలో ముఖ్యంగా కావలసిన అన్నవస్త్రాలకే నోచుకోక అవస్థ పడుతున్నందు వల్ల, స్వాతంత్ర్యాన్ని మేము ఈ దీనదళిత ప్రజల జీవన ప్రమాణాన్ని హెచ్చించే అవకాశంగా పరిగణించాము. ఇప్పుడు మాకు స్వాతంత్ర్యం లభించింది గనుక ఈ ప్రజలు శతాబ్దాలుగా మోసిన భారాలను తొలగించి, వారికి యోగక్షేమాలను చేకూర్చడమే నేడు మా ప్రధానాశయం

ప్రతి నేత్రంనుంచి జారే ప్రతి అశ్రుబిందువును తుడవడమే తన జీవన పరమావధి అని గాంధీజీ ఒక సందర్భంలో అన్నాడు. అయనవంటి మహాత్మునికి కూడా అది అసాధ్యమైన ఆదర్శమే. ఎందుచేతనంటే మన దేశంలోనూ, ఆసియా ఖండంలోనూ, ప్రపంచమంతటిలోనూ కోట్లకొలది దుఃఖాశ్రువులు రాలుతున్నవి. అనంతంగా వ్యాపించిన ఈ దుఃఖాన్ని పూర్తిగా తుడిచివెయ్యడం అసాధ్యం. అయితే

మానవుని దారిద్ర్యాన్ని, దీనతను, బాధను కొంతవరకైనా తగ్గించడం మనకు సాధ్యమే. ఈ ధ్యేయం కోసమే పాటు పడకపోతే, మన రాజకీయ తంత్రాలవల్ల, వాదాలవల్ల ప్రయోజన మేమిటి ?

అంధకారంలో నేను దారి వెతుకుకుంటూ, సూటిగా ఆలోచించడానికి, ఆలోచనతో ఆచరణను సమన్వయించ డానికి యత్నించాను. అయితే అది కష్టసాధ్యమని గ్రహించాను. ఎందుచేతనంటే రాజకీయంగా ఏ పని అయినా వ్యక్తిగతమైనది కాదు ఒకవర్గమో, జనసామాన్యమో కలిసి చేయవలసి వుంటుంది. అయితే సత్యాన్ని, శీలాన్ని నిర్లక్ష్యం చేసి, ప్రజలలో హింసాద్వేషాలను రెచ్చగొట్టే ఏ విధాన మైనా దుష్ఫలితాలనే ఇస్తుందని నా దృఢవిశ్వాసం. మన ఆశయాలెంత మంచివైనా, మనం సాధించగోరే లక్ష్యం ఎంత ఉత్తమమైనదైనా, మనం నడిచేది వక్రమార్గమైతే, మన ఉపకరణాలు చెడ్డవైతే,మనం ఏనాటికీ మన లక్ష్యాన్ని సాధించలేము. మానవాళిలో స్నేహసౌహార్దాలు వెల్లివిరి యాలని మనం కోరితే, ద్వేషాన్ని రెచ్చగొట్టకూడదు. ప్రపంచంలో ఈనాడు హింసాద్వేషాలు విలయతాండవం చేస్తున్న మాట నిజమే. వీటిని మనం విజృంభింపనీయకూడదు. దౌర్జన్యానికి లొంగకూడదు. దుర్మార్గాన్ని, దౌర్జన్యాన్ని మనం తప్పక ఎదిరించాలి. ఎదిరించేటప్పుడు మనం మన ప్రధాన లక్ష్యాలను జ్ఞప్తిలో ఉంచుకోవడమేగాక, ఆ లక్ష్యాలకు తగిన సాధనాలనే చేపట్టాలి.

చాలా సంవత్సరాలకు పూర్వం బెర్నార్డ్‌షా రచనలలో నేనొక ఉదాత్తమైన భావాన్ని చదివాను. ఆయన అభిప్రాయం నన్ను చాలా ఆకర్షించింది. "మనిషి నిజంగా జీవితంలో ఆనంద మనుభవించాలంటే, ఒక మహత్తర లక్ష్యాన్ని ఎంచుకొని, దానికే అంకితమైపోవాలి. ఆ లక్ష్య సాధనలోనే జీవితం పూర్తిగా పండి రాలిపోవాలి ఆ విధంగా ప్రకృతిలో తానొక మహత్తర శక్తిగా రూపొందాలి. అంతే గాని క్షుద్రమైన వస్తువుల కోసం ఆరాటిస్తూ, రోగాలతో, నొప్పులతో బాధపడుతూ, 'ప్రపంచం నాకు ఆనందాన్ని ప్రసాదించడం లేద'ని తిట్టుకుంటూ కూర్చోవడంవల్ల ప్రయోజనం లేదు" అని బెర్నార్డ్‌షా వ్రాశాడు.

మనలో అనేకులు అంతటి ఉన్నతశిఖరాల నందుకోలేరు. అయితే ఒకప్పుడు నిద్రాణమైన జాతికూడా ఉత్తమ నాయకుడు హెచ్చరించడం చేతనో, ప్రగాఢమైన వాంఛ ప్రేరేపించడం చేతనో నిద్ర మేలుకొని, సంఘటితంగా కృషిచేసి చరిత్రగతినే మార్చివేయడం జరుగుతుంది. గాంధీ మహాత్ముడు భారత రాజకీయరంగం మీదికి ప్రవేశించి, తన మహత్త్వపూర్ణ వ్యక్తిత్వ సందేశాల బలంచేత ఈ దేశ ప్రజలను ఉత్తమ లక్ష్యసాధనకై ప్రేరేపించినప్పుడు అచ్చంగా ఆ విధంగానే జరిగింది. మన జాతిజనకు డీనాడు మనతో లేకపోయినా, ఆయన సందేశం ఇంకా నిలిచివున్నది. ఆయన మనలో వెలిగించిన దీపంకూడా ఇంకా వెలుగుతూనే ఉంది.

ఆయన ప్రారంభించిన మహోద్యమంలో సగం భాగమే సాధించాము. నిర్విరామంగా కృషిచేసి మిగిలిన భాగం కూడా సాధించాలి. ఈ చరిత్రాత్మక కార్యసాధనలో మనమంతా సహచరులమే. భారత గౌరవ రక్షాదీక్షితులమై మనం కలిసి ముందడుగువేస్తూ, ఈ పనిని పూర్తి చేయాలి.

మన జాతిని నిస్సహాయ పరాజయ దుస్థితినుంచి ముందుకు నడిపి విజయం సాధించేటట్లు చేసిన నాయకుడు ఈనాడు లేడు. కాని ఆయన శ్రమించి సాధించిన ఫలం మాత్ర మున్నది. ఈ ఫలాన్ని మనం ఏవిధంగా అనుభవించాలో కొన్ని ఆశయాలనుబట్టి, ఆదర్శాలనుబట్టి నిర్ణయించాలి. ఉత్తమశీలం, చిత్తశుద్ధి, సహనభావం, సహకారం, నిర్విరామకృషి - ఇవి గాంధీజీ సదా ప్రబోధించిన ఆదర్శాలు. మనం భయద్వేషాలను విడనాడి, మన స్వతంత్ర రాజ్యాంగ వ్యవస్థను గాంధీజీ బోధించిన ఈ ఉత్తమాదర్శాల పునాదిమీదనే నిలబెట్టి, మన జనసామాన్యపు స్థితిగతులను బాగుచేయడానికే సదా కృషి చెయ్యాలని భారతీయులకు నా విజ్ఞప్తి.

ఇతరదేశా లెట్టి విధానాన్ని చేపట్టినా, మనం మాత్రం కుటిలనీతి నవలంబించరాదని నా నిశ్చితాభిప్రాయం. కేవలం ఉన్నతాదర్శాల దృష్టితోనే కాదు, అవకాశవాదాన్నిబట్టి చూసినా, నా నిశ్చయంలో మార్పుండదు.

ఈ ముప్పై, నలభై యేళ్ళ రాజకీయ జీవితంలో నేను నేర్చుకున్న పాఠమిదే. గాంధీజీ మన కెన్నో సంగతులు నేర్పాడు. ఆయన దగ్గర నేను నేర్చుకున్న పాఠం కూడా ఇదే. కుటిల మార్గం తాత్కాలికంగా లాభించినా, చివరకు మాత్ర మది లాభకారి కాదు.

గాంధీజీ నిలిపిన ఆదర్శ శిఖరాలనుంచి మనం చాలా దిగజారినమాట వాస్తవమేకాని, ఆయన సందేశ ప్రభావం మనమీద ఇంకా కొంతవరకు ప్రసరిస్తూనేవుంది.. పైగా ఇది కేవలం ఆదర్శాల సమస్య కాదు. ఈనాటి ప్రపంచ సమస్యలను స్పష్టంగా చూడగల దృష్టి ముఖ్యం. ప్రపంచరాజ్యాలు పరస్పరం రోషారుణనేత్రాలతో వీక్షించడంవల్ల కలిగే ప్రమాదాన్ని గురించి గాంధీమహాత్ముడు ఒక సందర్భంలో హెచ్చరించాడు. భవిష్యత్ప్రమాద సూచకమైన హెచ్చరిక అది. "మీ చూపును తిన్నగా ఉంచుకోండి" అని ఆయన అన్నాడు. అందుచేతనే నేను భారతదేశాన్ని గురించికాని, ప్రపంచ స్థితుగతులను గురించికాని, మనదేశానికి ఇతర దేశాలతోగల సంబంధాలను గురించికాని, ఏ సమస్యనైనా సూటిగా, స్పష్టంగా చూడడానికి యత్నిస్తాను. కోపంతో కళ్ళు ఎరుపెక్కితే ప్రయోజనంలేదు. అప్పుడు స్పష్టమైన యోచనకుగాని, ఆచరణకుగాని అవకాశం ఉండదు.

మనం శాంతిని కాంక్షిస్తే, శాంతి పూరిత వాతావరణాన్ని సృష్టించి, మనకు విరోధులమని భావించేవారిని,

మనల్ని అనుమానంతో కనిపెట్టే వారిని క్రమంగా అనుకూలంగా మార్చవలసివుంటుంది. ఇతరులు మనల్ని అర్థం చేసుకోవాలని మనం కోరినట్లే, మనంకూడా ఇతరులను అర్థంచేసుకోవాలి. బెదిరింపులతో, యుద్ధ ప్రస్తావతో శాంతిని మనం సాధించలేము. బ్రిటన్, భారతదేశాలు రెండూ గర్వించతగినట్టు తమ వివాదాన్ని శాంతియుతంగా పరిష్కరించుకున్న విధం మీకు తెలిసినదే. చాలాకాలం సంఘర్షణ సాగినా, చివరకు ఉభయపక్షాలవారం శాంతియుత వాతావరణంలో మా సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నించడంచేత, ఫలసిద్ధి కలగడంతోబాటు ఉభయుల మధ్య స్థిరంగా స్నేహ సౌహార్ద సంబంధాలు నెలకొన్నాయి. జాతులమధ్య, దేశాలమధ్య సంఘర్షణలు తలయెత్తినప్పుడల్లా ఈ శాంతియుత పరిష్కారోదాహరణాన్ని స్మరించడం మంచిది. సభ్యధోరణిలో సమస్యలను పరిష్కరించుకోవడానికి ఇదొక్కటే మార్గం. ఇందువల్ల తరువాత అసూయాద్వేషాలకు తావుండదు.

నేను ఏ పరిస్థితులలోనైనా ఆయుధాలు చేపట్టరాదనే కేవల శాంతివాదినికాను. దురదృష్టవశాత్తు నేటి పరిస్థితులలో ప్రపంచంలో ఎన్నటికీ అస్త్రసన్యాసంచేసి కూర్చునే అవకాశంలేదు ఆత్మరక్షణకోసం. హఠాత్తుగా ఏ ప్రమాదం ఎదురైనా తట్టుకోవడంకోసం ముందుగానే జాగ్రత్తపడవలసివుంటుంది. దురాక్రమణకు, ఇతర దౌర్జన్యా

లకు లొంగకుండా, ఎదిరించడానికి మనం సిద్ధపడాలి. దుర్మార్గానికి లొంగిపోవడం తప్పు. అయితే దుర్మార్గాన్ని ప్రతిఘటించేటప్పుడు మనంకూడా ఆగ్రహ భయాలకు వశులమై కుటిలమార్గాన్ని అనుసరించకూడదు. దురాక్ర మణను ఎదిరించేటప్పుడుకూడా మనతో భయావేశాలతో తలపడిన వ్యక్తులతోకూడా మనం స్నేహానికి సిద్ధపడుతూ, శాంతిపూరిత వాతావరణాన్ని నిలిపివుంచాలి. మన నాయకాగ్రణి గాంధీజీ మనకీ పాఠాన్నే బోధించాడు. మనలో ఎన్ని లోపాలున్నా, మనమీ బోధను పాటించ డానికి యత్నిస్తూనేవున్నాము. మనం నిర్వహించే కార్య కలాపాలు ఎంతవరకు మన అంతరంగ ప్రబోధాన్ని అనుస రిస్తున్నాయో పరిశీలించాలి. దీనినే జీవుని వేదన అని అనవచ్చు. నిత్యంగా తటస్థించే వ్యవహారాలను మనం శ్రద్ధగా పట్టించుకుంటే, అప్పుడీ ఆంతరంగిక వేదన తప్పదు.

రెండు విశిష్ట సంప్రదాయాలకు ప్రతినిధులై నిలిచిన ఇద్దరు మహోన్నత వ్యక్తులు - గాంధీజీ, రవీంద్రుడు - మనపై తమ ప్రభావాన్ని ప్రసరింపజేశారు. వారుభ యులు నవభారత నిర్మాతలు. మనం వారి మానస పుత్రులం. మనలో ఎన్నో లోపాలూ, అజ్ఞానమూ ఉన్నా, మనం వారి బిడ్డలమే. వారిద్దరిలో ఎంతో భేదం కనిపిస్తుంది. అయినా ఇద్దరూ భారతీయ సంస్కృతిని పూర్తిగా తమలో రూపొందించుకున్నారు. దశసహస్రాబ్ద వ్యాప్తమైన మన

సంప్రదాయం వారిలో కనిపిస్తుంది. వారిని చూసినప్పుడు భారతీయ సంస్కృతి బహుముఖమని మనకు జ్ఞప్తికి వస్తుంది. ఇద్దరూ నూటికి నూరుపాళ్ళు భారతీయులే. ఇద్దరిలో ఎంతో సాదృశ్యమున్నది. భేదమూ ఉన్నది. యువభారతాదర్శానికి - నేను యువకుడిగా ఉన్నప్పటి నా ఆదర్శానికి - వారు ప్రాతినిధ్యం వహించారు. ఆ ఆదర్శమే ఈనాటికీ అనేకులలో ఉన్నదేమో. అయినా వారిద్దరూ మనకిప్పుడు చాలా దూరమయ్యారనిపిస్తుంది. మాటిమాటికీ మనం వారి ప్రస్తావన చేస్తూనే వున్నాము, కాని మన మీనాడు ఇతర మార్గాలను, అన్యాదర్శాలను అనుసరిస్తున్నాము. ఆధునిక యుగంలో వారు ప్రాతినిధ్యం వహించి మనకు చూపిన ఆశాభావాన్ని, విశ్వాసాన్ని, ఫలప్రదమైన, నిర్మాణాత్మకమైన మహత్తరకృషిని విడిచి భారతదేశం కూడా ఇతర దేశాలవలెనే నిరాకరణ, నిర్మూలన తత్త్వంపట్ల మొగ్గు చూపుతున్నది.

అందుకే మనం వారించలేని ఏ ప్రతికూలశక్తివల్లనో ఇన్నాళ్ళు మనం పడిన శ్రమ విఫలమవుతుందేమోననే భయం నాకు కలుగుతూ వుంటుంది. అయితే మనం వాస్తవ స్థితిని గ్రహించకుండా విహాయసవీధులలో విహరిస్తూ, పరిస్థితులతో సంబంధంలేని సత్కార్యాలు చేస్తూ కూర్చోవడం కంటె, ఆ ప్రతికూలశక్తిని అణిచివెయ్యడానికి యత్నించడం మేలుకాదా? నన్ను బాధిస్తున్న సందేహాలలో ఇదొకటి.

స్వరాజ్యం సిద్ధించనంతవరకు విదేశీయులను మనదేశం నుంచి వెళ్ళగొట్టడమే మన ముఖ్యలక్ష్యంగా ఉండేది. అప్పుడు కూడా మనం సాంఘిక, ఆర్థిక, సంస్కరణలను గురించి మాట్లాడేవాళ్ళంకాని, అప్పటి మన ఉద్యమం ముఖ్యంగా రాజకీయమైనది. స్వరాజ్యం వచ్చాక ఎన్నో ఆర్థిక, సాంఘిక సమస్యలు మనకు ప్రత్యక్షమైనవి. ఈ సమస్యలను గురించి అభిప్రాయ భేదాలుండవచ్చు, కాని వీటిని పరిష్కరించడ మెట్లా అనేది ముఖ్యప్రశ్న. మనం 'గాంధీ వాద' మనీ, ఇతర 'వాదా' లనీ అంటూవుంటాం. అయితే వీటిని గురించి ఏదైనా చెయ్యడంగాక ఊరికే మాట్లాడుతూ కూర్చోవడం మన ప్రధాన లోపం. కేవలం శాసనాలవల్లనే, తీర్మానాలవల్లనే, ఆర్థిక, సాంఘిక సంస్కరణలు జరిగిపోతాయని మన మనుకుంటున్నట్టున్నది.

మాటకంటె క్రియ ముఖ్యం గనుక, క్రియకే ప్రాధాన్య మివ్వడమే విద్యావిధానంలో మన ఆదర్శం. ఇప్పుడిప్పుడే ఈ ఆదర్శం కార్యరూపం ధరిస్తున్నదిగాని ఇంకా చురుకుగా జరగడంలేదు. ప్రాతిపదిక విద్యలో చాలా సుగుణాలున్నవి. కేవలం పుస్తకాలలోని వ్రాతలను చిలుకపలుకులవలె వల్లించడంగాక ప్రత్యక్షంగా ఏదైనా చెయ్యడాని కుద్యమించడమే దాని విశిష్టతకు ముఖ్యకారణం. పసిబిడ్డకైనా సరే, ఏదో చెయ్యడం నేర్పుతారు. ఇది కేవలం భారతదేశానికే చెందినదని చెప్పడానికి

విలువేదు. ప్రపంచంలో అంతటా ఆధునిక విద్య ఈ సూత్రాన్నే పాటిస్తున్నది. అయితే భారతదేశంలో ముఖ్యంగా గాంధీమహాత్ముడు దీనికొక నిర్దిష్ట రూపాన్ని కల్పించాడు. ఒక పనిని గురించి ఊరికే మాట్లాడడం కంటె ఆ పని చెయ్యడానికి యత్నించడమే దీని మూల సూత్రం. ఊరికే మాట్లాడే మనుష్యులంటే నాకు చిరాకు. ఎంతటి బుద్ధిమంతులైనా ఊరికే చర్చించడంకంటె కార్య సాధన కుద్యమించినప్పుడే దాని తత్త్వాన్ని గ్రహించ గలుగుతారు.

ఇట్లా ఊహను క్రియతో జోడించడం చాలాముఖ్య మనుకుంటాను. క్రియకు దారితీయని యోచన వ్యర్థం. యోచన లేని క్రియ అవివేక సూచకం. మనం ఏమిచేసినా, యోచనను క్రియతో తప్పక జోడించాలి.



నిరుద్యోగ సమస్యా పరిష్కారానికే గాక, మన దేశాభ్యుదయానికే ఖాదీ, గ్రామ పరిశ్రమల అభివృద్ధి చాలా ముఖ్యమని నా నమ్మకం.

భారతదేశంవంటి దేశంలో భారీ పరిశ్రమలెంత వృద్ధిపొందినా, వాటితోబాటు గ్రామపరిశ్రమల వికాసానికికూడా చాలా అవకాశముంటుంది. దేశపు ఆర్థిక వ్యవస్థలో ఈ లఘు పరిశ్రమలకు అనువైనచోటు కల్పించడం అవసరం. ఖాదీ పరిశ్రమను, తదితర లఘుపరిశ్రమలను వృద్ధిచెయ్యాలనే మా సంకల్పం. కేవలం ప్రదర్శనం కోసం కాదు, నలుగురి మెప్పు పొందాలనీ కాదు. ప్రత్యక్ష ఫలితాలను సాధించడంకోసమే ఈ పరిశ్రమలను వృద్ధి చెయ్యాలని మా ఆశయం. అయితే పూర్తిగా ప్రభుత్వ వశంలోనే వుండి, ప్రభుత్వమే నడిపించే భారీపరిశ్రమల తోడ్పాటు లేనిదే ఈ కాలంలో ఏ దేశమూ తన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోలేదు.

జాతి ఆర్థిక పురోభివృద్ధికి లఘుపరిశ్రమలు చాలా వరకు తోడ్పడగలవని మా దృఢవిశ్వాసం. ఈనాడు నిరుద్యోగం మన కొక క్లిష్టసమస్యగా పరిణమించినదని మీకు తెలుసు. గ్రామపరిశ్రమల వికాసం ఈ సమస్యా పరిష్కారాని కెంతైనా తోడ్పడ గలదు. నిజానికి దేశంలోని ప్రతి

వ్యక్తికీ పని దొరికి, దేశాభ్యుదయ కార్యక్రమంలో అతడు పాల్గొనే అవకాశం లేనినాడు ప్రజాసంక్షేమరాజ్యమనే మాటకు అర్ధమే లేదు. తగిన సహాకారముంటే భారీపరిశ్రములకు, లఘుపరిశ్రమలకు పోటీ ఉండదని నా నమ్మకం.

ఖాదీకి, గ్రామపరిశ్రమలకు ప్రభుత్వం తగినంత సహాయం చెయ్యడం లేదని కొందరు విమర్శిస్తున్నారు. ఈ పరిశ్రమలు కేవలం ప్రభుత్వపు తోడ్పాటుమీదనే ఆధారపడివుంటే, వీటికి స్వయంగా పెంపొందగల చేవలేకపోతే, ఇవి ఎంతో కాలం నిలువలేవు. ఖాదీ, గ్రామపరిశ్రమలలో పనిచేస్తున్న వ్యక్తులీ సమస్యను పరిశీలించి, ప్రభుత్వం మీదనే ఆధారపడితే మానసికంగా ఎటువంటి పరిణామాలేర్పడతాయో ఆలోచించవలసివుంటుంది.

గాంధీజీ చరఖాకు, ఖాదీకి, గ్రామపరిశ్రమలకు ప్రాముఖ్యమిచ్చాడు. ఆయన చరఖాను ప్రజల దృష్టిలో ఒక ఆర్థిక సంకేతంగా, విప్లవచిహ్నంగా రూపొందించాడు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఆర్థిక కారణంకంటె విప్లవ చిహ్నంగానే ఖాదీ పరిశ్రమకు ప్రాముఖ్యం ఉండేది. అయితే ఈనాడు మనం ఖాదీ పరిశ్రమను వృద్ధి చెయ్యాలంటే విప్లవ చిహ్నంగా దానికేర్పడిన ప్రాముఖ్యంతో నిమిత్తంలేదు. ఆర్థికంగా అది ప్రజలకు లాభదాయకమైతేనే దానికి సమాజంలో మన్నన ఉండగలదు. అందుచేత ఈనాడు ఖాదీ, గ్రామపరిశ్రమలు వృద్ధిచెందాలంటే,

అందుకు నూతన దృక్పథం కావాలి. ఈ నాడవి ప్రభుత్వపు తోడ్పాటుమీదనే ఆధారపడక స్వశక్తితో వృద్ధిచెందాలి.

మహత్తరలక్ష్యాలను సాధించాలంటే, బుద్ధునినాటి నుంచి మనకు గాంధీజీ తిరిగి ఫలప్రదమైన కృషి కనుకూలించే సన్మార్గాన్ని చూపేవరకు మన విశిష్ట సంస్కృతి బోధిస్తూ వచ్చిన ఉత్తమాదర్శాలనే మనం పాటించాలి. విశాలదృష్టి, సహన భావం, కరుణ, జయాపజయాలకు, సుఖ దుఃఖాలకు చలించని చిత్తస్థైర్యం - ఈ లక్షణాలే వ్యక్తికి గొప్పదనం చేకూర్చుతాయి. హింసాద్వేషాలతోనూ, అంతఃకలహాలతోనూ మనం పురోగమించలేము. ఈనాడు మనదేశంలోగాని, ప్రపంచంలో మరెక్కడైనాగాని బల ప్రయోగం ద్వారా ఫలం సిద్ధించదు. మనం అభ్యుదయం చెందాలంటే సహన భావం, శాంతియుత సహకారం ముఖ్యం.

శాంతిని శాంతియుతంగానే సాధించాలి. ఉత్తమ లక్ష్యాన్ని ఉత్తమసాధనంతోనే పొందాలని, దుష్ట సాధనం ద్వారా సత్ఫలితం లభించదని గాంధీజీ పదేపదే బోధించాడు. ఇది కేవలం తర్కం, తాత్త్వికజిజ్ఞాస కాదు. శాంతి కావాలంటే అందుకు శాంతియుతంగానే కృషిచెయ్యాలి. ఈనాడనేక దేశాలు బెదిరిస్తూ, యుద్ధ నినాదాలు చేస్తూ శాంతిని గురించి మాట్లాడుతూ వున్నవి. వీటిలో పెద్దరాజ్యాలు, చిన్న రాజ్యాలనే భేదమేమీ లేదు. అన్నిరాజ్యాలూ ఈ విధంగానే యుద్ధానికి సిద్ధమని బెదిరిస్తూ, శాంతిని సాధించడానికి యత్నిస్తున్నవి. రాజకీయ నిపుణతకంటె సైనిక దృక్పథమే ఎక్కువగా వ్యాపిస్తున్నది

మనం రాజకీయవిప్లవం కొనసాగించి స్వాతంత్ర్యం పొందాం. ఇప్పుడు ఆర్థికపరిణామం జరుగుతున్నది. దానితోపాటు సాంఘిక పరిణామంకూడా సాగుతున్నది. అదికూడా ముఖ్యమైనదే. ఆర్థిక సాంఘిక పరిణామాలతో నిమిత్తం లేకుండా రాజకీయ పరిణామాన్ని ఊహించడం కష్టం. రాజకీయ పరిణామంతో పాటు ఆర్థిక పరిణామం కూడా అవసరమేనని ఇప్పుడు చాలా మంది ఒప్పుకుంటున్నారు గాని, సాంఘికపరిణామం పేరెత్తేటప్పటికి దానిని సంకుచితంగా నిర్వచిస్తూ, ఆర్థిక రాజకీయ పరిణామాలతో

సాంఘిక పరిణామానికి సంబంధం లేదని, సాంఘికంగా మార్పు వాంఛనీయం కాదని వాదిస్తున్నారు. ఆర్థిక, రాజకీయ, సాంఘిక శక్తులన్నిటి సమన్వయమే జీవితం. వీటిని విడదీయడానికి వీలులేదు గనుక, వారి వాదం తప్పని నా మనవి. రాజకీయ పరిస్థితి మారినా, ఆర్థికదృక్పథం మారినా, విధిగా సాంఘిక వర్తనకూడా మనం కావాలన్నా, వద్దన్నా మారుతుంది. అందుచేత దేశంలో విప్లవం ఈ మూడు రంగాలకు వర్తించి తీరాలి. ఏ వ్యక్తి అయినా రాజకీయంగా తాను విప్లవ వాదినని చెప్పుకుంటూ, ఆర్థిక సాంఘిక రంగాలలో మార్పుల కడ్డువచ్చే సంప్రదాయవాది అయితే, అతని జీవితంలో సమన్వయం లేదన్నమాట. స్టీవెన్‌సన్ నవలలో ఒకే పాత్ర డాక్టర్ జెకిల్, మిస్టర్ హైడ్ అనే రెండు రూపాలతో పరస్పర భిన్నంగా ప్రవరిస్తాడు. ఆర్థికంగా, రాజకీయంగా మార్పులవసరమే కాని సాంఘిక పరిస్థితులు మారకూడదనే వారి ధోరణి అటువంటిదే.

అస్పృశ్యతనే ఉదాహరణంగా తీసుకోండి. ధర్మశాస్త్రాలనుంచి సూత్రాలను నే నుదాహరించలేను గాని, ఆ శాస్త్రాలే అస్పృశ్యతను విధిస్తున్నాయని కొందరు వాదిస్తారు. అయినా ఆ ఆచారం సాంఘికంగా అన్యాయంగా కనిపించడమేగాక, గాంధీజీ మాటి మాటికీ చెప్పినట్టు హిందూసమాజపు మనుగడకే అది ముప్పు కలిగిస్తూవుండడం వల్ల, దానిని నిర్మూలించాలని చాలాకాలం కిందటనే

మేము భావించాము. అంటే ఈ సాంఘిక పరిణామం కేవలం హిందూసమాజ భద్రతదృష్టితోనే చూసినా విధిగా అవసరమయిందన్న మాట. ఈ దృక్పథాన్నే మానవుల పరస్పర సంబంధాలన్నిటికీ వర్తింపజేయాలి. వ్యక్తికీ వ్యక్తికీ మధ్య, వ్యక్తికీ వర్గానికీ మధ్య, వర్గానికీ వర్గానికీ మధ్య ఏర్పడే సంబంధాలే నిజానికి ప్రపంచంలో ప్రధాన సమస్య.

భారతదేశంలోని 36 కోట్ల పౌరుల అభ్యున్నతి కోసం మనం ప్రణాళికలను రూపొందిస్తున్నాము. దీనిని గురించి సిద్ధాంతరీత్యా ఎంతగానైనా చర్చిస్తూ కూర్చోవచ్చును. ఈ ప్రణాళికలను మనం ఏర్పరచుకోవడంలో సామ్యవాదం, కమ్యూనిజం, పెట్టుబడిదారీ విధానం, గాంధీవాదం మొదలైన వివిధ సిద్ధాంతాలలో దేనిని మనం పాటించాలని చర్చించవచ్చు. ఎన్ని సిద్ధాంతాలనైనా పేర్కొనవచ్చు. ఈ చర్చ ప్రయోజనకరమే. పరస్పరం సిద్ధాంతాలను గురించి వాదించడంవల్ల మన అభిప్రాయాలు స్పష్టమవుతాయి. అయితే ఒకనాడీమాటలకు నిర్దిష్టమైన అర్థముండేది కాని, ఇప్పుడెన్నో కొత్తభావాలు, ఆవేశాలు, సంఘర్షణలు పొడచూపడంవల్ల ఈ సిద్ధాంతాల హద్దులు మనకు గుర్తించడానికి వీలులేకుండా పోయాయి.

నేనూహించగలిగినంతవరకు ఇప్పుడున్న పరిస్థితులలో ఏ ప్రభుత్వమైనా పూర్తిగా అహింసా సిద్ధాంతానికే

కట్టుబడివుండడం అసాధ్యం. మనం అహింసా సిద్ధాంతాన్నే పాటించే పక్షంలో సైనికదళాన్ని, నౌకాదళాన్ని, విమాన దళాన్ని, ఉంచుకోకూడదు సరిగదా, బహుశా పోలీసు శాఖనుకూడా రద్దుచేయవలసివుంటుందేమో. ఉన్నతాదర్శం ఉండవచ్చు. ఆ ఆదర్శాన్ని సాధించడాని కనుకూలమైన రాజకీయ విధానాన్నే అనుసరించడానికి యత్నించవచ్చు. అయినా దేశంలో ఉన్న స్థితిగతుల మూలంగా ఆ ఆదర్శాన్ని ఆచరించలేకపోవచ్చు. అందుకు కొంతకాలం పాటు వేచివుండవలసి రావచ్చు. ఈ సంగతి మనం మరచి పోరాదు.

కాశ్మీరును దుండగుల దాడినుంచి రక్షించడానికి భారతసైన్యం కాశ్మీరు వెళ్ళడాన్ని గాంధీజీ సమర్థించాడు. సమర్థించడమేకాదు, నిజానికి ఆయన అందుకు ప్రోత్స హించాడు. పూర్తిగా అహింసా సిద్ధాంతానికే అంకిత మైన గాంధీజీ వంటి వ్యక్తి అట్లా ఆ చర్యను ఆమోదించడం ఆశ్చర్యకరంగా వుంటుంది. అంటే ఆయనకూడా కొన్ని పరిస్థితులలో ఆత్మరక్షణకోసం ప్రభుత్వానికి బలప్రయోగం చేసే హక్కున్నదని అంగీకరించాడన్నమాట. ప్రస్తుత పరిస్థితులలో భారత ప్రభుత్వం ఆ హక్కును వదులుకో లేదు. అయితే మనం బలప్రయోగాన్ని ఆత్మరక్షణకే ఉపయోగిస్తామని, కోరి యుద్ధానికి పురికొల్పమని, యుద్ధం ప్రారంభించమని, యుద్ధపరంగా దురాక్రమణ పద్ధతుల

నవలంబించమని స్పష్టంగా తెలియజేశాము. ఇదే మన రాజకీయ విధానం.

ఏ ప్రభుత్వమూ సత్యాగ్రహం చెయ్యదు, చెయ్య లేదు. సత్యాగ్రహమనేమాటకు వ్యవహారంలో స్థిరపడిన అర్థంలో నేను దానిని వాడుతున్నాను. అయితే కొందరు దానికింకా విస్తృతమైన అర్థాన్ని ఆరోపించవచ్చు. మన దేశంలో మాత్రం ప్రభుత్వవ్యవస్థకు వ్యతిరేకంగా సత్యా గ్రహం జరిగింది. అయితే ఒక ప్రభుత్వం మరొక ప్రభుత్వా నికి వ్యతిరేకంగా ఏ విధంగా సత్యాగ్రహం చెయ్యగలదో నాకు బోధపడడంలేదు.

మన ప్రభుత్వానికి సంబంధించినంతవరకు సత్యాగ్రహ ప్రసక్తి ఏదీ లేదు. ప్రభుత్వ దృక్పథ మిది. అయితే ప్రభుత్వ దృక్పథానికి భిన్నంగా ప్రజాదృక్పథం ఉండవచ్చు. ఒక రాజకీయ పక్షం సత్యాగ్రహాని కుద్యమించ వచ్చు. కాని ప్రభుత్వం మాత్రం సత్యాగ్రహాన్ని ప్రోత్సహించ లేదు. అయితే ఈ సత్యాగ్రహం మితిమీరక, శాంతియుతంగా సాగుతూవుంటే, దానివల్ల హింసాకాండ విస్తరించే ప్రమాదం లేకపోతే, ప్రభుత్వం తటస్థంగా వూరుకోవచ్చు. సామూహికంగా సత్యాగ్రహం జరగడానికి మేము సమ్మ తించక పోవడానికి కారణం, అందువల్ల ముందుగా ఊహించ లేని ఫలితాలు, విస్తృతంగా దౌర్జన్య చర్యలు జరుగవచ్చు ననే భయమే. అది సత్యాగ్రహంగానే ఉండక మరొకరూపం

దాల్పవచ్చు. సత్యాగ్రహ విధానంలో సుశిక్షితులైన వ్యక్తులు చాలామంది పాల్గొన్న పక్షంలో సామూహిక సత్యాగ్రహంకూడా క్రమబద్ధంగానే జరుగవచ్చు. సత్యాగ్రహ స్వరూప నిర్ణేతయైన గాంధీమహాత్ముడే సామూహికోద్యమాన్ని నిలిపివేసి, "ఇకనుంచి ఒక వ్యక్తిమాత్రమే చేస్తా" డని అన్నమాట మనకు తెలిసిందే. ఆయనతో పోల్చి చూస్తే, మనం ఇంకా ఓనమాలను నేర్చుకుంటున్నవాళ్ళమే. అయినప్పుడు సత్యాగ్రహస్వరూపం పూర్తిగా అర్థమయిందని ఎట్లా అనగలం? ఒక సంగతి మాత్రం నిశ్చయంగా చెప్పవచ్చు. మన మే సమస్యనైనా శాంతియుతంగానే పరిష్కరించు కోవాలంటే, దౌర్జన్యానికి దారితీసే పద్ధతులను - స్వయంగా అవి శాంతియుత మైనవే అయినా - అనుసరించ కూడదు.

అభ్యుదయానికి అనేక మార్గాలుండవచ్చునని, వివిధ దృక్పథాలుకూడా ఉండవచ్చునని, అయితే స్థూలంగా అవి సాధించదలచిన అంతిమ లక్ష్యాలు మాత్రం భిన్నంగా ఉండరాదని నమ్మిక ఉంటేనే, పంచశీల సిద్ధాంతానికి అవకాశ ముంటుంది. ఈ మాటనే మరొక విధంగా చెప్పాలంటే, సత్యం ఏ ఒక్క జాతికీ, దేశానికి పరిమితం కాలేదు. బహుముఖమైన సత్యస్వరూపం తనకే స్పష్టంగా గోచరించినదని ఎవ్వరైనా అనుకుంటే, అది అతని అజ్ఞతనే సూచిస్తుంది. ప్రతిజాతి, ప్రతిదేశం చిత్తశుద్ధితో పురోగమించాలంటే,

తమకు క్షేమకరమైన మార్గమేదో తెలుసుకోవడానికి ఎంతో శ్రమకు, కష్టనష్టాలకు గురికావలసి వుంటుంది. అప్పుడే వారికి అభ్యుదయం కలుగుతుంది. కేవలం ఇతరులను అనుకరించడంతోనే సంతృప్తి పడితే వారికి ప్రగతి ఉండదు. ఒకవేళ అనుకరణం బాగున్నా, అది సహజంగా వారి భావమథనం వల్ల సిద్ధించిన మార్గం కాక పోవడం చేత పొందికగా ఉండదు.

గడిచిన ముప్పైయేళ్ళలోనూ మనం గాంధీజీ అధ్వర్యాన అభ్యుదయ సాధనకు కృషిచేశాం. ఆయన ఏమి చేసినా, ఏమి చేయకపోయినా, ఆయన నాయకత్వంలో దేశం సంఘటితంగా అభ్యుదయం సాధించింది. మన సభ్యతా సంస్కృతుల కనుకూలమైన వికాసమది. అయినా మనం ఆధునిక ప్రపంచానికి దూరంకాలేదు. ఇతర దేశాలతో స్నేహ సౌహార్దాలకు లోపం రాకుండానే మన సంస్కృతి కనుకూలంగా మన వికాసాన్ని సాధించాం. ఈ సామరస్యం మునుముందుకూడా కొనసాగుతుంది. ఇతరుల నుంచి మనం నేర్చుకున్న సంగతుల ప్రభావం కొంతవరకు మన జాతీయ వికాసంలో కనిపిస్తుంది. అయినా మన వికాసం మనసభ్యతా సంస్కృతులకు, సంప్రదాయాలకు, విశ్వాసాలకు అనుకూలంగా రూపొందినట్టిది. పంచశీల సిద్ధాంతం కూడా ప్రతి జాతి తన భవిష్యత్తును తానే రూపొందించుకోవాలని చెప్తుంది. అంటే సేనాసంపత్తిని సమకూర్చుకోవాలనే కాదు.

మానసికంగా, నైతికంగా, ఆధ్యాత్మికంగా వికాసానికి కృషిచేస్తూ, ప్రపంచంలో నలుమూలలనుంచి వచ్చే భావ పరంపరను శ్రద్ధగా పరిశీలిస్తూ, ఇతరుల అనుభవాలను చూసి మంచిని గ్రహిస్తూ ముందుకు సాగడమన్న మాట. ఇతర దేశాలీవిధంగా తమ అభ్యుదయం కోసం చేసే ప్రయత్నాలను ఏ దేశమూ భగ్నం చేయక, వాటిని సానుభూతితో, సౌహార్దంతో చూడడం అవసరం.

గోవాలో సత్యాగ్రహం చేయడాని కుద్యమించిన వారికి భారత సైన్యపు తోడ్పాటు లభిస్తుందని వారే నమ్మారని గాని, వారి కెవరో చెప్పారనిగాని కొందరనగా విన్నాను. నిజంగా ఆ విధంగానే జరిగితే, సత్యాగ్రహ స్వరూపమే మారిపోతుంది అసలు సత్యాగ్రహమంటే ఏమిటి? భౌతికశక్తిని మానవుని నైతికశక్తి ఎదిరించడమే సత్యాగ్రహం. అది అమోఘమైన ఆయుధం. శత్రువును వెనుకంజ వేయిస్తుంది. సత్యాగ్రహంచేసే వ్యక్తి ప్రాణ త్యాగానికైనా సిద్ధమవుతాడు. సత్యాగ్రహతత్త్వం మనిషికి ధైర్యస్థైర్యాలను చేకూర్చి, ఎదుటివానికి జంకు కలిగిస్తుంది అయినప్పుడు సత్యాగ్రహంచేసేవారు తమకు సైన్యపు తోడ్పాటు లభిస్తుందనుకుంటే, పరిస్థితి పూర్తిగా మారినట్టే. అప్పుడది సత్యాగ్రహమే కాదు.

గాంధీజీకి పెద్ద కర్మాగారాలంటే ప్రత్యేకంగా అభిమానం లేదు గనుక, ఈ కర్మాగారానికీ, గాంధీజీకి సంబంధ మేమిటని కొందరు ఆశ్చర్యపడవచ్చు.[7] ఆయన అంత కంటె ఎక్కువగా గ్రామసీమలను గురించి, గృహాలను గురించి యోచించాడు. అయితే ఆయనకు కర్మాగారా లంటే ఇష్టం లేదనుకోవడం తప్పేమో. నిజంగా ఆయన ఈనాడు జీవించివుండే సౌభాగ్యమే మనకు కలిగితే, ఈ ఫ్యాక్టరీ పని ప్రారంభిస్తున్నందుకు ఆయన సంతోషించే వాడని నా నమ్మకం. మిగిలిన ఫ్యాక్టరీలవలెనే ఈ ఫ్యాక్టరీ కూడా గ్రామపరిశ్రమలను వృద్ధిచెయ్యాలని, మన గ్రామాల లోనూ, పట్టణాలలోనూ జీవిస్తున్న అసంఖ్యాక ప్రజానీకపు జీవనస్థితిని బాగుచెయ్యాలని గాంధీజీ ఏర్పరచుకున్న ప్రధాన లక్ష్యాల కేవిధంగానూ అడ్డురాదు.

గాంధీజీని గురించి కొందరు పాక్షికంగా, సంకుచితంగా ఊహిస్తారు. ఆయన బహుముఖ వ్యక్తిత్వాన్ని మనలో ఎవ్వరూ సమగ్రంగా అర్థంచేసుకోలేరేమో. ఆయన సంపూర్ణ స్వరూపాన్ని గ్రహించక ఏవో ఒకటి, రెండు లక్షణాలనే తీసుకుని, గాంధీజీ తత్త్వమంటే అంతే అని

7. 1955 లో గాంధీజీ జన్మదినోత్సవం నాడు మదరాసులోని ఇంటెగ్రల్ కోచ్ ఫాక్టరీని ప్రారంభిస్తూ అన్నమాటలు.

భ్రమిస్తూ వుంటాము. చాలామంది ఆయన ఏమి చెప్పాడని ఆలోచిస్తారే గాని, ఆ మాటలను ఆయన ఎందుకు చెప్పాడు, దాని యథార్థతత్త్వ మేమిటని చర్చించి చూడరు. ఆయన బుద్ధి ఏ విధంగా పనిచేసేదో చూడడానికి మనకు చాలా అవకాశాలు లభించాయి. వాటివల్ల ఆయన దృష్టి అతి విశాలమైనదనీ, గంభీరమైనదనీ, ఆయన కేవలం కోట్లకొలది భారతప్రజలను గురించేగాక యావన్మానవజాతి లాభక్షేమాలను గురించి యోచించేవాడని తెలుస్తుంది.

ఒక ప్రత్యేక ముహూర్తాన ఒక మహాసామ్రాజ్యానికి వ్యతిరేకంగా భారతజాతి సాగిస్తున్న స్వాతంత్ర్య సమరానికి నాయకుడు కావడం చేత, ఆయన ఆ జాతీయోద్యమానికి, దేశ నిర్మాణాత్మక కృషికి అక్కరకు వచ్చే పద్ధతులను, సాధనాలను సమకూర్చు కున్నాడు. అందుచేత ఆయన గ్రామపరిశ్రమలకు ప్రాధాన్య మిచ్చాడు ఆనాడు గ్రామ పరిశ్రమలవల్ల ప్రయోజనం లేకపోవచ్చునని సందేహాలు వెలిబుచ్చినవారు, గాంధీజీని విమర్శించినవారు సైతం నేడు గ్రామ సీమలను వృద్ధి చెయ్యాలని, గ్రామ పరిశ్రమలను ప్రోత్సహించాలని వాదించడం వింతగా వుంది. ఆయన తర్కంతో నిమిత్తం లేకుండా తన లోకజ్ఞత చేతనే గ్రామ పరిశ్రమల ప్రయోజనాన్ని గుర్తించాడు. ఆ సత్యాన్నే ఇతరులు చాలాకాలం తర్కించిన మీదట గ్రహించగలిగారు. గాంధీజీ భావనకూ, ఈ ఫ్యాక్టరీ, ఇంకా ముందు మనం

నిర్మించడానికీ యే ఫ్యాక్టరీల స్థాపనకూ మధ్య పేచీ ఏమీ లేదు. ఈ రెండుమార్గాలను మనం సమన్వయించడానికి యత్నిస్తున్నాం.

పెద్ద కర్మాగారాలను నెలకొల్పితేనే తప్ప మన భౌతిక జీవనప్రమాణం వృద్ధి చెందే అవకాశం లేదు. పెద్ద ఫ్యాక్టరీలను స్థాపించకపోతే జీవన ప్రమాణాలమాట అటుండగా మనం కనీసం మన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కూడా పరిరక్షించుకోలేమని నా నమ్మకం. అయితే ఇంకా చాలా కాలంవరకు మనదేశంలో సువిస్తృతంగా గ్రామపరిశ్రమలు వ్యాపిస్తేనే ప్రజలందరికీ పనీ, పాటా చేసుకుని సుఖంగా ఉండే అవకాశాలు కలుగుతాయనికూడా నా నమ్మకం.

---

మన దేశచరిత్రను చూస్తే, చిరకాలంగా మన ప్రజలు పరస్పరవిభేదాలతో, అంతఃకలహాలతో దేశపు మహితశక్తిని వ్యర్థం చేసినట్టు కనిపిస్తుంది. ఇది నిజంగా మన దురదృష్టం. చరిత్రనుంచి ఇప్పటికైనా మనం గుణ పాఠం నేర్చుకోవడం శ్రేయస్కరం. భావనలో, క్రియలో, సంగీత సాహిత్యాలలో, ఇతర కళలలో, సాధన కవకాశ మిచ్చే అన్నిరంగాలలోనూ మనదేశంలో మహాపురుషులు జన్మించారు. అయినా ఎవరికివారే చీలిపోయి, నలుగురు నాలుగుదారులు పట్టే మన స్తత్త్వం మూలాన వారి ఘనత వల్ల మనం ఎక్కువగా లాభం పొందలేకపోయాము. అందుకే మన జాతి నిర్వీర్యమయింది. తరుచుగా విదేశస్థులు మనల్ని జయించి పరిపాలించడానికి వీలయింది.

మనదేశానికి వచ్చిన విదేశీయు లెవ్వరూ నిజంగా మన దేశాన్ని జయించలేదంటే తప్పులేదేమో. బ్రిటిష్‌వారికి ఎంతటి సైనికబలమూ, ఆయుధాలూ వున్నా, వారు నిజంగా మనదేశాన్ని, సేనాబలంతో జయించలేదు. మన దేశంలో ఉన్న చీలికల నవకాశంగా తీసుకుని వారు మనకు పరిపాలకులై కూర్చున్నారు. ఇతర విదేశస్థులు చేసిన ఘన కార్యం కూడా అదే. భారతదేశ చరిత్ర బోధించే ముఖ్య పాఠ మిదే. కనుక మనం కలిసిమెలిసి జీవించడం చాలా

అవసరం. మనలో మనం ఎంత వాదించుకున్నా, తగాదాలు పడినా, ఒక్కసారి శాంతియుతంగా, ప్రజాస్వామిక పద్ధతులలో ఒక నిర్ణయం చేసుకున్న తరువాత, ఆ నిర్ణయానికి బద్ధులమై కృషి చెయ్యాలి.

గాంధీజీ నాయకత్వాన జరిగిన స్వాతంత్ర్య సమర కాలంలో మేమీ సిద్ధాంతాన్ని అనుసరించి సంఘటితంగా కృషి చెయ్యడంచేతనే మన జాతికి నవశక్తి చేకూరింది. గడిచిన ముప్పై, నలభై యేళ్ళ చరిత్రను నేను ప్రస్తావిస్తున్నాను. అది భారతదేశచరిత్రలో విశిష్టమైన కాలం. దానిని మునుముందు చరిత్రకారులు బహువిధాల వర్ణిస్తారు. ఆ నలభై యేళ్ళపాటు గాంధీజీ మాకు శిక్షణ నిచ్చి, తప్పటడుగు వేసినప్పుడల్లా మందలించి, భారతదేశంలో వివిధ రాష్ట్రాలు, వాతావరణపరిస్థితులు, భాషలు, మతాలు మొదలైనవి ఉన్నప్పటికీ ఈ విభిన్నతలో ఏకత్వం కూడా ఉన్నదని బోధించాడు.

మన దేశం చైతన్యపూర్ణమై శోభించిన ప్రాచీన కాలంలో మన యాత్రిక బృందాలు ఆగ్నేయ ఆసియా, పశ్చిమ ఆసియా, మధ్య ఆసియా ప్రాంతాలలో అంతటా మన మతాన్ని, భాషను, సంస్కృతిని, ఆచారాలను, కళలను, శిల్పశాస్త్రాన్ని వ్యాపింపజేశారు.

తరువాత మన సంస్కృతిని జడత్వమావరించింది. ఇతరదేశాల మాట మరచిపోయి మనం తలుపులు వేసుకుని

కూర్చున్నాం. మరొకచోటికి వెళ్ళడమంటే భయం పట్టుకుంది. సముద్రయానం కూడదని, విదేశాలకు వెళ్ళితే మన మతం, జాతి భ్రష్టమవుతాయని ఎన్నో నిషేధాలను, నూతనాచారాలను ఏర్పరుచుకున్నాం. వర్ణభేదాలను గురించి సంకుచితంగా యోచించి, ఎన్నో చీలికలు చేసుకున్నాం. ఆ కాలంలోనే రాజకీయంగా, సాంస్కృతికంగా, సాంఘికంగా మనకు క్షీణదశ ప్రాప్తించింది. అందుచేతనే మనం దుర్బలుల మయ్యాం. విదేశీయులు మనపై దండెత్తివస్తే, వారిని మనలో లీనం చేసుకోలేకపోయాం.

తరువాత చరిత్ర మారింది. మనం తిరిగి స్వతంత్రుల మయ్యాం. రాజకీయ స్వాతంత్ర్యం మనకు రాజకీయమైన పన్నాగాలవల్ల సిద్ధించలేదు. స్వాతంత్ర్యలక్షణాలను మనలో పెంపొందించుకోవడంవల్ల మనం స్వాతంత్ర్యాన్ని గడించాం. క్రమశిక్షణను, నవచైతన్యాన్ని, త్యాగబుద్ధిని మనం పెంపొందించుకున్నాం. అన్నిటిని మించి గాంధీజీ నాయకత్వాన మనం సమష్టిగా కృషి చెయ్యడం నేర్చుకున్నాం. ఈ గుణాలను మన మీనాడు నిలుపుకోవడమే కాదు, ఇంకా పెంపొందించుకోవాలి.

రాజకీయంగా చాలావరకు మనం ఏకమయ్యాం కాని, అంతకంటె గాఢమైన భావసంబంధమైన ఏకీకరణం జరిగి, తమ ప్రాంతీయ వైవిధ్యాలను నిలుపుకొంటూనే భారత ప్రజలందరూ కలిసిపోయి శక్తివంతమైన ఏకైక

జాతిగా రూపొందాలి. ప్రాంతీయ వైవిధ్యాలు నిలిచే వుండాలి కాని, మనం క్షుద్రకలహాలకు దిగకూడదు. తరచుగా మనం మనకు నచ్చని మరొకరి అభిప్రాయాన్ని స్వీకరించవలసి వస్తుంది. ప్రజాస్వామిక విధానమది. గడచిన నలభై యేళ్ళలో కాంగ్రెస్ సంస్థలో మేము ఆ విధానానికే కట్టుబడ్డాము.

గాంధీజీ నిరంకుశుడు కాదు. ఆయన ఎవరినైనా శాసించగలవాడే. అయితే ఆయనకు మా మీదవున్న ప్రేమాభిమానాలవల్ల, ఆయన విజ్ఞతపట్ల మా కేర్పడిన అపార గౌరవం వల్లనే ఆయన మమ్మల్ని తన ఇచ్ఛానుసారం నడుప గలిగాడు, కాని బలవంతంగా మాత్రం కాదు. తరుచుగా మేమాయనతో వాదించేవాళ్ళం, పేచీలు పడే వాళ్ళం. ఒక్కొక్కప్పుడు మా వాదమే సరియైనదని ఆయనను ఒప్పించేవాళ్ళం. ఆయనలో ఎన్నో సుగుణా లుండేవి. ఎదుటి వ్యక్తిలోని మంచితనాన్ని పెంపొందించడం వాటిలో ఒకటి. ఆ వ్యక్తిలో అనేక దుర్గుణాలుండుగాక, గాంధీజీ మాత్రం అతనిలో వున్న మంచితనాన్నే గుర్తించి ప్రోత్సహించేవాడు. అందుచేత ఆ మానవుడు మంచిగానే ఉండడానికి ప్రయత్నించవలసివచ్చేది. ఏదైనా తప్పుచేస్తే అతనికే సిగ్గుగా, సంకోచంగా ఉండేది.

ఎప్పుడూ ఎదుటివారి తప్పు లెన్నగోరేవారికి తప్పులే కనిపిస్తాయి. ఈ మాట వ్యక్తులకూ వర్తిస్తుంది,

జ్ఞాతులకూ వర్తిస్తుంది. ఏదైనా విదేశానికి వెళ్ళి చూడండి. మీకు నచ్చని సంగతు లనేకం కనిపిస్తాయి. అయితే విదేశాలలో కనిపించే లోపాలనే వెతుకుతూ కూర్చోవడం మంచిదా? వారిలో మనం నేర్చుకుని బాగుపడదగిన సుగుణా లేమున్నాయో తెలుసుకోవడం మంచిదా?

ఎన్నో శతాబ్దాలనుంచి భారతదేశం సహనభావాన్ని, సానుభూతిని బోధిస్తూ, మానవ భావనకు, కళకు, సాహిత్యానికి, తత్త్వశాస్త్రానికి, మతానికి ఎంతో పుష్టిని కలిగించింది. సముద్రయానంలో తటస్థించే కష్టాలను లెక్క చేయక భారతీయులు సుదూరప్రాంతాలకు ప్రయాణం చేశారు. దండెత్తాలని కాదు. దురాక్రమణకు కాదు. శాంతి దూతలై వెళ్ళారు. వ్యాపారం చెయ్యడానికి వెళ్ళారు. అందమైన వస్తుపులతోబాటు ఉత్తమ భావాలను కూడా అందించడానికి వెళ్ళారు వేనవేలేండ్లుగా సాగిన ఈ చరిత్రలో మనదేశం ఎన్నో శుభాశుభాలను అనుభవించింది. అయితే సర్వదా శాంతి. సహన సందేశాన్ని స్మరిస్తూనే ఉంది. మన తరంలో మళ్ళీ ఫలప్రదమైన శాంతియుత సామూహికోద్యమం సాగించి, స్వాతంత్ర్యాన్ని సాధించిన మన నాయకాగ్రణి గాంధీజీ ఈ సందేశాన్నే ప్రబోధించాడు.

గాంధీజీని గురించి నేను తరుచుగా తలుచుకుంటూ వుంటాను. ఎన్నో ఊహలు. స్మృతులు మనస్సులో సంచలిస్తాయి. కొంత సంవేగ్నావస్థకూడా కలుగుతుంది. గాంధీజీని

గురించిన ఊహా సందేహాన్ని కలిగించదు కాని "ఆయన ఈ పరిస్థితులలో ఎట్లా ప్రవర్తించేవాడు, ఏమి చెయ్యవలసిన దని సలహా యిచ్చేవాడు, ఆ సలహాకు, మనం చేస్తున్న పనికి ఎంత వ్యత్యాస మున్నది" అని నాలో నేను తర్కించుకుంటూ వుంటాను. ఈ ఆలోచన నన్ను బాధిస్తుంది. ఇతరులు కూడా ఈ విధంగా భావనుధనానికి గురి అవుతూ వుండవచ్చు. ఆయన నెలకొల్పిన ఉన్నత ప్రమాణాలనే నేను ఆచరణలో సాధించగల ననుకునే సాహసం నాకు లేదు. అయితే ఈ తరానికి చెందిన మన మందరం గాంధీగారి బోధ ననుసరించి కృషి చెయ్యడం, చెయ్యకపోవడం మాట అటుంచి, ఆయనను గురించి మన మాటలకూ, చేతలకూ ఏమైనా సంబంధ మున్నదా, లేక బహిరంగంగా ఆయనను గురించి స్తోత్రపాఠాలు చేస్తూ, ఆచరణలో మరొక మార్గాన్ని అనుసరిస్తున్నామా అనే సందేహం నాకు తరుచుగా కలుగుతూ వున్నది ఇది అతి క్లిష్టసమస్య. ఈ సమస్యను నాకు సంబంధించినంతవరకు నేనే పరిష్కరించుకోలేక పోతున్నాను. కనుక ఇతరులకు నేనేమీ చెప్పలేను.

అయితే గాంధీజీ మన ఊహాల కందని మహోన్నతుడని, తన అనుచరులను స్వతంత్రంగా ఆలోచించనివ్వడమే గాక అందుకు వారిని ప్రోత్సహించి, తాను వారికి దారి చూపుతూ, ఎవరిబుద్ధి ననుసరించి వారు తమ కర్తవ్యాన్ని నిర్ణయించుకోవడాని కవకాశ మిచ్చేవాడని జ్ఞప్తికి తెచ్చు

కుని కొంత ఊరట పొందుతుంటాను. ఆయన ఎవరినీ బల వంతంగా తన ఇచ్ఛ ప్రకారం నడువ వలసినదని శాసించే వాడు కాదు. ఇతరులను తన పక్షాని కాకర్షించుకోవా లని ఆయన కోరినా, బలవంతంగా కాదు. ఎవరూ తమ ఆశయాలను, విశ్వాసాలను తమలోనే అణుచుకుని, గుడ్డిగా తన మాటలను చేతలను అనుకరించడం ఆయన కిష్టంలేదు. అట్లా పరాధీనులైన అనుచరులు కావాలని ఆయన కోర లేదు. అయితే ఆయన మహత్త్వపూర్ణ వ్యక్తిత్వపు నీడలో ప్రజలు స్వతంత్రంగా యోచించ లేకపోయేవారు. అంతటి మహనీయుని సాన్నిధ్యంలో ఆ స్థితి తప్పనిసరి. అయినా ఆయన మాత్రం అందుకు ప్రోత్సహించలేదు. అందువల్ల, సమస్య లుత్పన్నమైనప్పుడు మనం స్వతంత్రంగా ఆలోచించి నిర్ణయాలు చేసుకోవడం మనవిధి. గాంధీజీ మనకు బోధించిన పాఠాలను దృష్టిలో ఉంచుకోవాలి. అయితే ఆయన ఏదో సందర్భంలో విభిన్న పరిస్థితులలో అన్నమాటల చాటున దాగడానికి ప్రయత్నించక, మనం స్వతంత్రంగా సమస్య లను పరిష్కరించు కోవలసి వుంటుంది.

పరిస్థితులు పూర్తిగా భిన్నంగా ఉన్నప్పుడు ఆయన ఏమి చెప్పేవాడో, ఏమి చేసేవాడో ఊహించడం కష్టం. ఎందుకంటే ఆయన చాలా చురుకైన మనిషి. పరిస్థితులు మారుతున్నా, ఎప్పుడూ వెనుక కంఠస్థం చేసిన మాటలే తిరిగి పలికే వ్యక్తి కాదు. కొన్ని సిద్ధాంతాలను ఆయన

ప్రామాణికంగా భావించి, తన నిర్ణయానుసారమే జీవిత యాత్రను సాగించగలిగాడు. తాను స్పష్టంగా నమ్మిన సత్యాన్ని ఇక ఏ పరిస్థితిలోనూ విడిచి వేయడమంటూ ఉండేది కాదు. అయితే జీవితంలో ప్రతి స్వల్ప విషయాన్నీ మార్చడానికి వీలులేని పరమ సత్యంగా ఆయన పాటించ లేదు. జీవితం క్షణక్షణమూ మారుతూ, వృద్ధి చెందుతూ వుంటుందని, అందుచేత మనంకూడా తదనుగుణంగా మార్పులకూ కూర్పులకూ సిద్ధం కావాలని ఆయన గుర్తిం చాడు. ఆయన భారతదేశానికీ, మానవ జాతికీ మహత్తర సేవచేసిన అర్ధ శతాబ్ద కాలంలో స్వయంగా ఆయనలో ఎంతో వికాసం కనిపించింది. ఎన్నో సమస్య లెదు రయ్యాయి. కొత్త సమస్యలను భిన్న పద్ధతులలో పరిష్క రించడానికి ఆయన వెనుకాడ లేదు. ప్రధానాదర్శాలకు భంగం లేకుండానే మార్పును పసికట్టి దాని నెదుర్కొన డానికి ఏ విధంగా సంసిద్ధం కావాలో గాంధీజీకి తెలుసు. మనం ఇప్పుడున్న స్థితిలో ఆయనను గురించి మాట్లాడుతూ, ఆయన అదర్శాల కనుగుణంగా వర్తిస్తున్నామని, ఎట్లా చెప్పుకోగలమనే నా చింత.

ఆయనను గురించి మాట్లాడా లనిపించడం సహజమే. ఎందుకంటే ఆయనను తలుచుకోగానే ఏదో మహత్త్వం స్ఫురణకువచ్చి కొంత ఓదార్పుగా ఉంటుంది. ఆయన స్మృతి మన జీవితంలో తలయెత్తే క్షుద్ర కలహాలను, ద్వేషా

లను మగిపించి, వాటికి అతీతమైన ఉన్నత సీమలలోనికి తీసుకువెళ్ళి మనకుకూడా కొంత ఔన్నత్యాన్ని కలిగిస్తుంది.

ఆయనను స్మరించడం చాలా మంచిది. ఆయనను తలచుకోగానే మనకు ఆత్మపరీక్ష చేసుకోవాలనిపిస్తుంది. ఆయనను దర్శించినప్పుడు మనకు అమితమైన ఆనందం కలిగేది. ఇప్పుడేమో ఆయనను తలచుకున్నప్పుడు, మనం ఇన్నిసారులు ఆయనను స్మరిస్తున్నా, ఆయన బోధించిన ఆదర్శాల ననుసరించి జీవిస్తున్నామా అనే సందేహం కలిగి కొంచెం బాధగా వుంటుంది. ఆయన సాన్నిధ్యంలో మెలిగిన రోజులలోకూడా ఆయన దర్శనం ఎంత ఆనంద దాయకంగావున్నా, నిజంగా ఆయన అనుచరులం కావ డానికి మన మర్హులమేనా, మనం లోకానికి మన నిజ స్వరూపమే ప్రదర్శిస్తున్నామా అనే సందేహం లోపల సదా బాధిస్తూనే వుండేది. ఆయన సాన్నిధ్యంలోనే ఈ సందేహం బొడసూపేదంటే, ఇక ఇప్పుడది ఎంత కలవర పరుస్తున్నదో వేరే చెప్పనక్కరలేదు. ఆయన స్మృతి ఈ చిరసందేహాన్ని జ్ఞప్తికి తెస్తుంది. అయితే జీవితమంతా ప్రశ్నలతోనే వ్యర్థం చెయ్యడానికి వీలులేదు. వర్తమానంలో ఉత్పన్నమయ్యే సమస్యలను పరిష్కరించుకోక తప్పదు. నిర్ణయాలు స్వతంత్రంగా చేసుకోక తప్పదు. మన బుద్ధి ననుసరించి మనం పనిచెయ్యవలసి వుంటుంది.

మరొక సంగతికూడా వుంది. ఒక్కొక్కప్పుడు మన బుద్ధిననుసరించి పనిచెయ్యడానికికూడా వీలుకాదు.

అది మరొక చిక్కుసమస్య. గాంధీజీ అసాధారణవ్యక్తి. ఆయన గొప్పనాయకుడే, కాని మనం చూసే ప్రసిద్ధ రాజకీయనాయకులకంటె ఆయన ఎంతో భిన్నగా వుండే వాడు. ఆయన సందేశాన్ని మనం గౌరవిస్తున్నాం గనుక, ఫలితాలతో నిమిత్తం లేకుండా మనం మన సిద్ధాం తాలనే అంటుపెట్టుకొని వుండాలని, పరిస్థితులతో రాజీ పడకూడదని అనుకుంటాం. అయితే రాజకీయనాయకులు మాత్రం ప్రజలను ముందుకు నడిపించవలసి వుంటుంది. రాజకీయమనే మాటను నేను నీచార్థంలో వాడడంలేదు. సమర్థులైన, రాజనీతిజ్ఞులైన ప్రజానాయకులను దృష్టిలో ఉంచుకునే అంటున్నాను. ప్రజలెంతవరకు ముందుకు నడువడానికి సిద్ధంగా వున్నారో, అంతవరకే నాయకులు వారిని నడిపించగలరు. సత్యమార్గమేదో నాయకుడు చూడ గలిగినా, తన అనుచరులుకూడా ఆ మార్గాన్ని చూడలేక పోతే అతడేమి చెయ్యగలడు? వాళ్ళ నెక్కువదూరం ముందుకు తీసుకువెళ్ళలేక, తానొక్కడే ముందుకు వెళ్ళితే ఏమి ప్రయోజనం? అతడుకూడా వారితో కలిసి పయ నించదలచితే, వారి ఇచ్ఛననుసరించి కొంతవరకు తన కార్యక్రమాన్ని మార్చుకోవలసివస్తుంది. అందుచేత అతని దృష్టిలో సాధించదగిన పనికీ, ఉన్నపరిస్థితులలో సాధించ గలిగిన పనికీ మధ్య కొంత పేచీ వస్తుంది.

గాంధీజీ ఆదర్శవాది. సత్యారాధకుడు. అయితే ఆయన ప్రజాహృదయాన్ని చక్కగా గుర్తించిన నాయ

కుడు. నిజంగా భారత జన సామాన్యానికి ప్రాతినిధ్యం వహించ గలిగిన నాయకుడు ఆయన ఒక్కడే. ప్రజల మన స్తత్వం ఆయనకు క్షుణ్ణంగా తెలుసు. మా అందరికంటె గాంధీజీయే వారిలో ఏకం కాగలిగేవాడు. ఆయన వారితో అద్భుత కార్యాలను చేయించాడు. వారవి సాధించగలరని ఆయనకు తెలుసు. అందుకే వారా ఘనవిజయాలను సాధించగలిగారు. అసాధ్యమైన పనులకు ఆయన వారిని ప్రేరేపించలేదు. ఒక వ్యక్తిని ఆయన కఠినతర క్రమశిక్షణకు లోనుచెయ్యవచ్చు, కాని జన సామాన్య మంతటినీ ఆయన అటువంటి పరీక్షకు గురిచెయ్యలేదు. అయినా ఆయన తాను తప్పని భావించిన పనిని ఏ పరిస్థితిలోనూ ఆమోదించలేదు. ఇట్లా పరిస్థితులతో నిత్యమూ రాజీ పడని రాజకీయ నాయకులు ప్రపంచంలో మరెవ్వరూ వుండరు. ఈ రాజీ స్వల్పవిషయాలలో కావచ్చు. అయితే స్వల్ప విషయాలలో రాజీ పడడానికి సిద్ధమయితే, క్రమంగా ముఖ్యసమస్యల విషయంలోకూడా ఈ మార్గమే అనుసరించే ప్రమాదముంది. ఇది కత్తిమీది సామువంటిది. ప్రజాస్వామిక వ్యవస్థలో ఈ విధంగా పరిస్థితులతో రాజీ పడక తప్పదు. ఎందుకంటే ఈ వ్యవస్థలో నాయకుడు ప్రజలను నడిపించడంతో బాటు, ప్రజలు నాయకుణ్ణి నడిపించడం కూడా ఉన్నది. తరుచుగా మాలో ఈ భావమథనం జరుగుతూ ఉంటుంది గనుక నేను మీకీ సంగతులు చెప్పాను."

ఈనాడు మనదేశ సమస్యలను, ప్రపంచ సమస్యలను ఎదుర్కోవడమే కష్టంగా వుంది. రోజురోజుకీ అవి క్లిష్టతర మవుతున్నవి. పౌరుషంతో మనం వాటిని ఎదుర్కొనవలసి వస్తున్నది. ఇక వాటిని గాంధీజీ మరేదో సందర్భంలో చెప్పిన మాటలతోనో, చేసిన పనులతోనో జోడించి పరిష్కరించా లంటే మరింత కష్ట మవుతుంది. ఆయన ఆయా సందర్భా లలో, చెప్పిన మాటలను గురించి నేననడం లేదు. ఆయన మాటలలో పరస్పర వైరుధ్యం లేకుండా అన్ని శ్రవణా నంద కరంగా మేళవిస్తాయి. ఆయన జీవితం కూడా నిపుణ చిత్రకారుడు చిత్రించిన కళా ఖండం వలె ఎక్కడా వెలితి, వంకర లేకుండా రమ్యంగా రూపొందింది. ఒక ప్రత్యేక సందర్భంలో ఉత్పన్నమైన ఒక ప్రత్యేక సమస్యను ఆయన పరిష్కరించిన విధం మాత్రం కలకాలానికీ దారి చూప గలిగినది కాకపోవచ్చు. ఐతే ఆయన జీవితానికి మాత్రం కలకాలం నిలిచిపోగల విలువ ఉన్నది. చిరంతన సత్యానికి గల ఈ లక్షణమే ఆయన జీవితానికీ ఉన్నది.

మనలో కొందరు గాంధీజీ ఏదో సందర్భంలో అన్న మాటలనో, నిర్దేశించిన ఆచరణనో తీసుకుని, వాటినే పరమ ప్రమాణంగా భావించి, ఇతర సందర్భాలలో ఆయన అంత కంటె ముఖ్యమైన మాటలను చెప్పిన సంగతి మరచి పోతారు. శిష్యుడు స్వల్ప విషయాలకే ప్రాధాన్యమిచ్చి గురువు బోధించిన ముఖ్యపాఠాలను మరచిపోయే ప్రమా

దం ఎప్పుడూ ఉంది. అది తప్పనిసరి. ఎందుచేతనంటే శిష్యుడు తన గురువు విశిష్టతను పూర్తిగా గుర్తించలేక తన అల్పబుద్ధి ననుసరించి స్వల్పవిషయాలనే గ్రహించి ముఖ్యబోధను నిర్లక్ష్యం చెయ్యవచ్చు.

ఒక్కసంగతి మాత్రం నిశ్చయంగా చెప్పవచ్చు. ఒక మహాపురుషుడు. సర్వేశ్వరుని దూత, మన భారత భూమిలో సంచరించి, తన తపోమహిమచేత దానిని పునీతం చేశాడు. ఆయన దేశాన్ని పునీతం చెయ్యడమేకాదు, మన ప్రజల మనస్సులను, హృదయాలను మార్చివేశాడు. తామే బుద్ధి మంతులమని భావించేవారి మనస్సులనుకాదు; దీనులు, విపన్నులు, నిరాశ్రితులయిన సామాన్య ప్రజల మనస్సులను మార్చివేశాడు. అందుచేత ఆయన చిత్రమే ప్రశస్త చిత్రం. తమకోసం యోచించి, శ్రమించి, తమ జీవితాలలో ఆశను, ఆనందాన్ని మొలకెత్తించిన మహాపురుషుని చిత్రంగా మనదేశంలోని సామాన్యప్రజలు ఆయన చిత్రాన్ని చూస్తారు.

అన్నిటికంటె ముఖ్యంగా మనం ఆ చిత్రాన్ని, ఆయన బోధలోని మూలసూత్రాలను జ్ఞప్తిలో ఉంచుకోవడం మంచిది. లక్ష్యాలకంటె సాధనాలు ముఖ్యమని, వక్ర సాధనాలతో, వక్రాయుధాలతో సాధించే లక్ష్యాలెన్నటికీ మంచివి కాజాలవని ఆయన పదే పదే హెచ్చరించాడు. ఈ మాటలను నేను వల్లించిన పాఠం తిరిగి అప్పగించినట్లు

చెపుతున్నాను. కాని నిత్యజీవితంలో అనేక స్వల్ప విషయా లలో ఈ బోధను పాటించడం దుస్తరంగా వుంది. కేవలం తెలుపు, నలుపు (మంచి, చెడుగు) మన ఎదుటవుంటే మనం దేనిని గ్రహించాలో మనకు తెలుసు. కాని మన జీవితా లలో రకరకాల పాళ్ళలో తెలుపు, నలుపు వన్నెలు కలిసి పోయిన మిశ్రమవర్ణమే తరుచుగా తటస్థిస్తూ వుంటుంది. అయినా గాంధీజీ సిద్ధాంతాన్ని సదా జ్ఞప్తిలో ఉంచు కోవడం అవసరం. పతనం చెందకుండా అది రక్షిస్తుంది.



స్వాతంత్ర్య సిద్ధితో మన సుదీర్ఘ తీర్థయాత్రలో ఒక ఘట్టం ముగిసింది. కాని ఇంకా మనం ముందడుగు వేస్తూనే నడవాలి. మనదేశ సౌష్టవం కోసం పాటుపడడం మన యాత్రలో నూతనఘట్టం. అందుచేత ఈనాడు[8] మనం మన ప్రధానాదర్శాలను, ముఖ్యంగా మనకు శక్తిని ప్రసాదించిన గాంధీజీని, సంస్మరించుకోవడం అవసరం.

తన బలాన్ని వృద్ధి చేసుకుని, స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోవడం ఏ దేశానికైనా ప్రథమకర్తవ్యం. స్వాతంత్ర్యాన్ని నిర్లక్ష్యంచేసి ముందుగా ఇతర విషయాలను గురించి యోచిస్తూ కూర్చుంటే సర్వనాశనం కావచ్చు. ఏ సమస్యనైనా ఈ దృష్టితోనే చూడాలి. మనదేశంలో ఐకమత్యాన్ని నిలుపుతూ, దేశాన్ని సుసంపన్నం గావించడమే మన ప్రథమ కర్తవ్యమని గుర్తించాలి. మనలో ఎవరైనా ఈ మాట మరచిపోయి ఇతర విషయాలకే ప్రాముఖ్యమిస్తే, దేశమంతటిని గురించి యోచించక దానిలో ఒక భాగం అవసరాలను గురించే పట్టుబట్టితే, తీరూ, తెన్నూ లేకుండా ఒక రాజకీయ సిద్ధాంతం విడిచి మరొక రాజకీయ సిద్ధాంతాన్ని స్వీకరిస్తూవుంటే, మన దేశక్షేమంకంటె తమ భాష క్షేమమో, తమ కులం క్షేమమో ముఖ్యమనుకుంటే, అప్పుడు మనమందరం నిశ్చయంగా భ్రష్టంకాకతప్పదు. ప్రాంతీయాభిమానాలు మితిమీరనంతవరకు మంచివే. మన పట్నమంటేనో, రాష్ట్రమంటేనో మనకు అభిమానం ఉంటే

8. 1960 స్వాతంత్ర్యదినోత్సవం.

తప్పులేదు. కాని మన కుటుంబాన్నో, పట్నాన్నో, భాషనో, కులాన్నో, రాష్ట్రాన్నో మనదేశంకంటె ముఖ్యంగా పరిగణించినప్పుడల్లా మనజాతికే పతనావస్థ కలిగేదన్న సంగతి మనం మరచిపోరాదు. మళ్ళీ మనం ఆ తప్పునే చేస్తే, మనదేశం తిరిగి పతనం చెందగలదు.

గతించిన అర్ధశతాబ్దంలో స్వాతంత్ర్యాన్ని సాధించడం కోసం మన ప్రజలు చేసిన మహత్తర త్యాగాలను మనం జ్ఞప్తిలో వుంచుకోవాలి. గాంధీజీ నాయకత్వాన మనప్రజలు శాంతియుత సత్యాగ్రహమనే అపూర్వాయుధ బలంతో మనదేశానికి శక్తిని చేకూర్చిన మాట మనం స్మరించాలి.

స్వరాజ్య సంసిద్ధి దుష్కర మనిపించలేదు. ఎటూ మనకు స్వరాజ్యం వచ్చి వుండేది. మన ఐకమత్యం, దృఢ సంకల్పం, కార్యతత్పరత మనకు స్వరాజ్యాన్ని చేకూర్చాయి. మన స్వాతంత్ర్యానికి శత్రువులు వెలుపల కాదు, మనలోనే ఉన్న సంగతి మనం గ్రహించాలి. మనం నిర్మల హృదయాలతో సంఘటితంగా కృషిచేస్తే, బయటినుంచి ఏ ప్రమాదమూ రాజాలదు. మన అంతఃకలహాలను, క్షుద్ర బుద్ధిని, దౌర్బల్యాన్ని అవకాశంగా చేసుకోనే విదేశస్థులు వచ్చి మనదేశాన్ని వశం చేసుకోగలిగారు. వారు మనల్ని జయించింది వారి బలపరాక్రమాలవల్ల కాదు, మన ఆంతరంగిక దౌర్బల్యంవల్ల. మన అవివేకమే వారిని రప్పించింది.

ఇప్పుడు మళ్ళీ ఆ అవివేకం, దౌర్బల్యం సూచనగా కనిపిస్తున్నవి మనం దేశమంతటికీ విధేయులమై వుండాలనే సంగతి మరచిపోయి, ప్రత్యేకించి ఒక భాషనో, రాష్ట్రాన్నో

పై కెత్తాలని ఉబలాటపడుతున్నాం. ప్రతి భారతపౌరుడూ తాను ప్రత్యేకించి ఒక వర్గాన్నే సమర్థించాలా, యావ ద్దేశాన్నీ పటిష్ఠం చెయ్యాలా అని ఆత్మపరీక్ష చేసుకోవలసిన సమయం వచ్చింది. ఇది ఈనాడు ప్రతిపురుషుడు, స్త్రీ, శిశువు ఎదుర్కోనవలసిన విషమ సమస్య.

మనచుట్టూవున్న ప్రపంచాన్ని, నలుమూలలనుంచి మనకు రాగల ప్రమాదాలను మనం స్పష్టంగా గుర్తించడం లేదు. అగ్రరాజ్యాలీక్షణంలో సామూహికంగా జనాన్ని రూపుమాపగల ఘోర మారణాస్త్రాలను నిర్మించుకుంటూ, యుద్ధానికి సంసిద్ధ మవుతున్నవి. ఈ దావాగ్ని ఎన్నడు మనల్ని ఆవరిస్తుందో ఎవ్వరూ చెప్పలేరు. మన ఐకమత్యా నికి ముప్పుతేగల ఈ ప్రమాదాలను మనం విస్మరించి, క్షుద్ర మైన అంతఃకలహాలలో చిక్కుకుంటున్నాం.

మన యుగాన్ని గురించి మునుముందు చరిత్రకారు లేమని వ్రాస్తారు ? ఈ దేశంలో జన్మించిన నాయకాగ్రణిని గురించి వారు వ్రాస్తారు. బానిసలై పోయిన ప్రజలను సంఘటితంచేసి, పరస్పరం సహకరిస్తూ పాటుపడడం, తమ మధ్య లేచిన గోడలను కూల్చివేయడం, నిర్భాగ్యులైన హరిజనసోదరుల జీవనస్థితిని బాగుచేయడం ఆయన వారికి నేర్పాడని ఆ చరిత్రకారులు వ్రాస్తారు. ఆసేతు హిమాచల పర్యంతం భారతదేశ ప్రజలు నిద్రలేచి, ఆత్మగౌరవాన్ని పెంపొందించుకుని గాంధీజీ నాయకత్వాన స్వాతంత్ర్యాన్ని గడించి, ఇతరులు కూడా స్వాతంత్ర్యం పొందడానికి చేయూత నిచ్చారని, కొన్ని వందల సంవత్సరాల తరువాత భారతదేశం తిరిగి తన పూర్వ గౌరవస్థానాన్ని పొందగలిగిన



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA107B167 |
| పుస్తకం పేరు | భయవిముక్తి |
| తారీఖు | 21 February 2025 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 133 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | I,II |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Naveeda |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| సంస్థితి | good |